# శ్రీ భగవద్గీత



ఆలమూరు వేంకటాచలము

శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్‌ప్రైజెస్
మ్యూజియం రోడ్,
విజయవాడ-2.
ఫోన్ 63322

SRI BHAGAVATGEETA
(Telugu Poetry)

By Alamuru Venkatachalam,
C/o A. V. Ramana Murthy, M.A.,
Lecturer M. R. College,
Vizianagaram-531202





First Edition : December 1983



Distributors :
Sri Mahalakshmi Book Enterprises,
Vijayawada-520 002.

Cover Design : BALI

**Price : Rs. 8-00**

Printers :
Sri Annapurna Printing Press
Vijayawada-2.

# కృతజ్ఞత


ఆధ్యాత్మిక గ్రంథముల ప్రచురణకు ఆర్థిక సహాయము"
అను పథకము క్రింద
తిరుమల తిరుపతి దేవస్థానమువారు ఒసగినధనముతో
ఈ గ్రంధము ముద్రింపబడి, ప్రచురింపబడినది.

ార్థిక సహాయమునకు కారణభూతులైన
ుమల తిరుపతి దేవస్థానము పాలకవర్గమునకు
నము నిపుణుల సంఘము సభ్యులకు
నము కార్య నిర్వహణాధికారి శ్రీ జి కుమారస్వామి రెడ్డి
యస్ గారికి,

్త కార్యనిర్వహణాధికారి, శ్రీ డి. సుబ్బరాయలుగారికి,
సంబంధశాఖాధిపతి శ్రీ రావుల సూర్యనారాయణమూర్తిగారికి,
పత్రికాసంపాదకులు శ్రీ కె. సుబ్బారావుగారికి
నయ కృతజ్ఞతాభివందనములు

ంథ ముద్రణమున నాతో సహకరించిన
హాలక్ష్మి బుక్ ఎంటర్ ప్రైజెస్‌వారికి,
పూర్ణ ప్రింటింగ్ ప్రెస్‌వారికి
ధన్యవాదములు

రచయిత

# సమర్పణము

కృష్ణపరమాత్మ! సంసృతిక్లేశహరణ
అప్రమేయ ప్రభావ! గీతా ప్రవక్త!
ఏక! అద్వయరూప! త్రిలోకశరణ!
పద్మనాభ! హృషీకేశ! పరమపురుష!

శరణాగతజనభయపరి
హరణా! కారుణ్యరసమయాంతఃకరణా!
స్మరణాదపవర్గప్రద
చరణా! వనమాలికా ప్రశస్తాభరణా!

చేతోమోహము వాయ పార్థునకు నీ
చే బోధితంబైన ఆ
గీతాశాస్త్రము తెల్గుసేసి కడు భ
క్తిన్ నీకె అర్పించితిన్
శీతాంశోరమృతార్పణం బనుక్రియన్
చేకొమ్ము దీనిన్ ప్రభూ!
భూతాధార! పురాణపూరుష! స్వయం
భూ! కృష్ణ! యోగేశ్వరా!

# శ్రీ భగవద్గీత

## ప్రార్థన

అఖిలలోకోపకారార్థము శ్రీకృష్ణ
పరమాత్మచే నాటబడియె నెద్ది,
ఆత్మప్రబోధమె అంకురోదయముగా,
ఉపనిషద్ బీజమై యొప్పె నెద్ది,
భగవంతుడైన యాబాదరాయణునిచే
బహుయత్నమున సాకబడియె నెద్ది,
సకలశాస్త్రరహస్య శాఖోపశాఖల
సంచయంబున విస్తరించె నెద్ది
జ్ఞానవైరాగ్యములె పత్రసముదయముగ,
హరిచరణభక్తియే పుష్పపరిమళముగ,
సంశ్రితులకెద్ది మోక్షవిశ్రాంతిదముగ,
పరగు; అట్టి గీతాకల్పతరువు గొలుతు.

మును గాండీవికి వాసుదేవుడు నినున్ బోధింపగా, భారతం
బున వ్యాసుండు గ్రథించె మానవహితంబుం గోరి; కైవల్యగే
హిని, వద్వైతసుధాప్రవర్షిణివి తల్లీ! నీవు; చేమోడ్చి భ
క్తినుపాసింతు ననుగ్రహింపు భగవద్గీతా! భవద్వేషిణీ!

నియతముగ నిత్యగీతా
ధ్యయనము సాగించు నెవడు తత్పరమతియై,
భయశోకాదివివర్జితు
డయి, విష్ణునిపదము నొందు నతడవలీలన్.

పనివడి గీతాశాస్త్రము
అనుదినము పఠించువాడు, ప్రాణాయామం
బొనరించువాడు తొలగున్
తన తొల్లిటిమేని దుష్కృతములకు గూడన్.

మలముక్తికరము ప్రాఁదిన
సలిలస్నానము, సహ స్తసంసారమహా
మలముక్తికరము గీతా
జలసకృదవగాహనంబు జనములకెల్లన్.

భారతామృతపూరసర్వస్వ మగుచు,
మధునిషూదను వదనపద్మమున నుండి
వెలువడిన గీతయను గంగజలము నెవరు
గ్రాఁతురు వారలకు పునర్జన్మ లేదు.

ఉపనిషత్తులెల్ల కపిలగోవులు, వాని
పితుకువాఁడు గోపసుతుఁడు శౌరి,
క్రీడి దూడ, మహితగీతామృతము పాలు
తత్త్వధనులు దాని ద్రావువారు.

స్వయముగ మురారిముఖసరోజమున నుండి
వెలువడియెగాన, గీతను విహితమనుచు
గానమొనరించు నెవ్వఁడు వాని కితర
శాస్త్రసంగ్రహమున ప్రయోజనము కలదె.

మహితసర్వశాస్త్రమయమహానిధి గీత,
మహితసర్వవేదమయుఁడు శౌరి,
మహితసర్వతీర్థమయతరంగిణి గంగ,
మహితసర్వధర్మమయుఁడు మనువు.

ఎవ్వని కృపాకటాక్షమె ఈదురంత
సంసృతిక్లేశభరమును చక్కఁజేయు
పార్థసారథి కతనికి ప్రణతి సేతు
సచ్చిదానందమయునకుఁ సర్వగునకు.

ఎవ్వని వినుతింతు రింద్రాది దివిజులు,
బ్రహ్మరుద్రులును దివ్యస్తవముల;
గానము సేతు రంగపదక్రమాన్విత
వేదాంతముల సామవేత్త లెవని;

ధ్యానసమాధిలో తద్గతస్వాంతులై
యుండి దర్శింతురు యోగులెవని;
ఎవ్వని అంతము నెఱుగజాలరు సిద్ధ
గరుడకిన్నరసురాసురగణంబు;

శోకభయములడగు సుకృతము పెంపొందు,
జనుల కెవని శ్రవణసంస్మరణముల
వాని వాసుదేవు వారిజదళనేత్రు,
కృష్ణు గొలుతు చేతులెత్తి మ్రొక్కి.

అర్జును రథంబు నడపుచు అతనిచిత్త
సంచలత మాన్పగా ప్రసాదించె నెవడు,
అఖిలలోకోపకృతిగ గీతామృతమును;
ఆజగద్గురు కృష్ణాత్మ నాశ్రయింతు.

మూగవానిజేయు వాగుడుకాయగా,
కొండకొనకు జేర్చు కుంటివాని,
ఎవనికరుణ వానికెఱగెద సచ్చిదా
నందరూపనందనందనునకు.

చాణూరకంసమర్దను,
వాణీపతివినుతచరణు వసుదేవసుతున్
శ్రీనిలయు దేవకీవర
మానందను గొలుతు కృష్ణు అఖిలాండగురున్

పాండవుల కేడుగడయై;
గండము లన్నిఁటికిబాపి కైవర్తకుఁడై,
ఖండననది దాటించిన
అండజవాహను భజింతు అచ్యుతు శౌరిన్.

మురళీభూషితహస్తుఁడై సజలజీమూతాభుఁడై కాంచనాం
బరుఁడై బింబఫలాధరోష్ఠయుతుఁడై పర్వేందురమ్యాస్యుఁడై,
అరవిందాయతనేత్రుఁడై తనరు కృష్ణాత్ముండు గోపాలకే
శ్వరు కంటెం బరమైన తత్త్వము నెఱుంగన్ విశ్వమందెచ్చటన్.

భారతం బను చమురు నిండారబోసి,
జ్ఞానదీపము వెలిగించి జగతికెల్ల
వెలుగు నొసగిన సువిశాలవిమలమతికి
వ్యాసభగవంతునకు కరద్వయము మోడ్తు.

నలుమొగములులేని నాళీకగర్భుడు,
ద్విభుజుఁ డయిన అపరవిష్ణుమూర్తి,
నుదుట కన్నులేని మదనారి, వేదపా
రాయణుండు బాదరాయణుండు.

ఓమ్

# శ్రీ భగవద్గీత
# ప్రథమాధ్యాయము
## అర్జున విషాదయోగము

ధృ త రా ష్ట్రు డు :

ఘన ధర్మక్షేత్రంబన
జనిన కురుక్షేత్రమందు సంజయ ! సమరం
బునకు సమకట్టి, నా నం
దనులును, పాండవులు ఏ మొనర్చిరి చెపుమా

సం జ యు డు :

సమరోపక్రమణమునకు
సమయంబగుటయు, నరేంద్ర! శాత్రవసన్నా
హముజూచి, గాండివము స
జ్యము సేయుచు బలికె, విజయుడచ్యుతు తోడన్

అ ర్జు ను డు :

కురుసేనలోన నేనె
వ్వరితో పోరాడవలయు, వలయుం జూడన్,
ఇరువాగు నడిమినేలకు
అరదముబోనిచ్చి, నిలుపుమిచట ముకుందా !

సం జ యు డు :

అనుటయు, మధుసూదను డిరు
మొనలనడుమ, భీష్మగురుల ముందట అరదం

పాదనకైన వీరి బరిమార్పనొడంబడనన్న, చిన్నయీ
మేదిని కోసమై పొడువ మేకొనువాడనె వారిజోదరా!

కావరు, లాతతాయులని కౌరవులం గడతేర్ప నేమిరా
బోవును? తప్పు చేసిన కుపుత్రుని జంపిన తండ్రి పుత్రహ
త్యావృజినంబె కాని ముదమందునె? మాకును భ్రాతృబంధుహ
త్యావృజినంబు, దుఃఖమును తప్ప ముదంబెటుకల్గు మాధవా!

అతులిత లోభోపహతచేతసులు కాన
ధార్తరాష్ట్రులు కుల ధ్వంసమునకు
బంధు మిత్రద్రోహ పాపకృత్యమునకు
వెనుదీయకుండుట వింతకాదు;
కాని యారెండిటి కతన జేపడు దోస
మామూల మెఱిగిన మేము దేవ!
విరమింప వలదె యీ దురితకర్మమునుండి
క్రూరచిత్తులె కుంతి కొడుకు లకట!

కుల వినాశనమున గులధర్మములు చెడు
సంభవించు వర్ణసంకరంబు,
అరుగుదురు కులఘ్నులగువారు దుర్భర
నరక కూపమునకు నరక దమన!

ఎంత దురంతపాపమున కెత్తితి నక్కట! రాజ్యలోభ సం
క్రాంత మతిన్ ముకుంద! ఇక కయ్యపు జోలికి బోవనేను, దై
త్యాంతక! మారుసేయని నిరాయుధు నన్ను సుయోధనుండు దు
శ్చింతత జంపునేని, అది క్షేమతరంబగు నా కవశ్యమున్

సంజయుడు :

"అని పలికి శోక విదళిత
మనస్కుఁడై, ఉభయసైన్య మధ్యమున శరా
సనము దిగవిడిచి కవ్వడి
జననాధ! రధంబు మీద జతికిల బడియెన్.

ఈ విధమున అనుకంపా
భావావేశమున గలగి, బాష్పోదక ప
ర్యావిలలోచనుడై, వా
పోవు నరుం జేర్చ, మధురిపుం డిట్లనియెన్

శ్రీ భగవంతుడు :

అలము సేయక తీరని
కాలమున విమోహమెట్లు క్రమ్మెను నిన్నున్
జాలిపుల చందమిది, ఇది
తూలించును సద్గతియును, తొల్లిటి యశమున్.

పేడితనము నొంద పాడిగా దర్జున!
పిటికి కంఠ ఎన్నడెఱుగ వీవు,
మనసు నుండి పేదతనము నువ్వేత్తుగ
పారద్రోలి లెమ్ము వీర సింహ !

అర్జునుడు :

శాంతనవద్రోణులు మా
కెంతయు పూజార్హులరట! ఏ నెటు తగపుం

జింతింపక, నిశితాశుగ
సంతతితో వారి నెదుర జాలుదు కృష్ణా!

అనుభవించు టెట్టు లకట! ఈ జగమున
బిచ్చమెత్తి బ్రతుకవచ్చు గాని,
గురు జనంబు జంపికొని వారి నెత్తుట
దోగినట్టి రాజ్య భోగములను.

వారిని మేమోడింతుమొ,
వారికె మా మీద గెలుపు వచ్చునొ, తెలియన్
నేరము, గెలుపోటములను
ఈ రెండిట పెద్ద లెస్స ఎయ్యది మాకున్.

ఓపి ఎవరిజంపు టొకపెద్ద గెలుపైన
గెలుపుగాదు మాకు తలప; అట్టి
పెద్దతండ్రి కన్నబిడ్డలు కారె? ఈ
పన్నినట్టి మొనల నున్నవారు

కార్పణ్య దోషంబు కారణంబుగ నాకు
ప్రతిహతమయ్యె స్వభావ మిపుడు,
కలగి, ధర్మా ధర్మములు నిర్ణయింపగ
అసమర్థమయ్యె నా అంతరాత్మ;
కాన నిన్నడిగితి; గరుణింపునన్ను నా
కేది మేలది నిశ్చయించి కఱపి,

సాక్షాద్గురుండవై శిక్షింపు నీ శిష్య
పరమాణుమైన ప్రపన్ను నన్ను,
ఇంద్రియంబుల నెరియించు ఈ నితాంత
శోకవహ్ని చల్లారదు నాకు కృష్ణ!
అహితభయములేని ప్రాజ్యరాజ్యంబె కాదు
కడిది దేవేంద్ర పదవి చేపడిన గూడ."

స ం జ యు డు :

అని చివర హృషీకేశుని
గని "యుద్ధము సేయజాల,క్షమియింపుము న"
న్నని కురువర! ఇంకేమియు
అనక గుడాకేశుడుండె అవనతముఖుడై



# ద్వితీయాధ్యాయము

## సాంఖ్య యోగము

సంజయుడు:

ఇరు మొనల నడుమ, ఇటు మన
మెరియగ, విలపించుచున్న ఇంద్రతనూజున్
కురునాథ! హృషీకేశుడు
కరయుగమున బోదివి పలికె కలకల నగుచున్.

శ్రీ భగవంతుడు:

విలపింపదగని వారికి
విలపించుచు, పలికి తీవు విజ్ఞుల సూక్తుల్:
విలపింప రున్నవారికి,
బలవద్వ్యాధివశత చన్నవారికి విజ్ఞుల్.

భారతవీర! శరీరము
వేరనియు, శరీరి ఆత్మ వేరనియు, గనన్
నేరక, రెండిటికైక్యము
ఆరోపించుకొని వగచి తవివేకమునన్

చెడునవి దృశ్యములగు మన
జడ భౌతిక విగ్రహాములె, చైతన్య సమే
తుడు వానిలోని, ఆత్ముడు
చెడదెన్నడు, కంటబడడు, చెందడు వికృతుల్.

లేనివాడగాను నేనెప్పుడును మున్ను,
నీవుగూడ, నేటి నృపులుకూడ;
మన కళేబరములు మట్టిలో గలియనీ
ముందుగూడ లేకపోము మనము.

సర్వవిభుడను నేనెట్లు శాశ్వతుడనో,
ప్రాణులందరు ఆత్మరూపమున నట్లె
శాశ్వతులుసుమ్ము. కావున చావులేని
వారికై ఇట్లు ముకర్కారి వగవనేల?

దేహి ఎటుపొందు తన స్థూలదేహమందు
బాల్యకౌమారములను, జవ్వనము, జరయు,
అటులనేపొందు తుదకు దేహాంతరమును,
ప్రాజ్ఞులందుకు మోహవిహ్వలులుకారు

దేహాంతరగమనముచే
ఏ హానియు జెందదాత్మ, ఇది ఎఱుగుము, నీ
మోహమున కాదిహేతువు
దేహాత్మద్వైతభావతీవ్రత సుమ్మీ

ఖలితపు విషయేంద్రియముల
కలయిక సుఖదుఃఖములకు కారణమరయన్,
నిలుకడలేనివి, వచ్చుం,
దలగున్, సైరింపువాని ధైర్యముతోడన్

సమకొని, విషయేంద్రియములు
దమియింపగ జాలవెవని, ధైర్యోన్నతు, డా
సమ దుఃఖసుఖుడె, భారత !
అమృతత్త్వము నధిగమింప అర్హతగాంచున్

అస్తిత్వముకల్ల అస
ద్వస్తువునకు, కల్లగాదు ఫల్గున ! అదీ స
ద్వస్తువునకు, కనిరి మహా
ద్వాస్తవమును దీని తత్త్వదర్శనులెల్లన్

వేనిచే వ్యాప్తమయ్యె ఈ విశ్వమెల్ల
ఆ మహాయాత్మ సద్వస్తు, వవ్యయంబు
అప్రమేయము, అవినాశి, అద్వయంబు
వాని గడతేర్ప నెవనికి వశముగాదు

కను, మాత్మయొకడె నిత్యుం
డనియును, వానికి ఉపాధులగు దేహము లె
ల్ల నసద్వస్తువులనియును
వినాశవంతంబులనియు విపుల విచారా !

కురువీర ! ఆత్మచెడునను
పురుషుడు, మరి చెఱచుననెడి పురుషుడును, నిజం
బెఱుగనివారలె, ఎవనిం
జెఱుపదు సుమ్మాత్మ, తానుజెడదెవ్వనిచే

జననమునున్న; మార్పులును, చావును కల్లలు; పూర్వముండి యా
వెనుక అదృశ్యమౌటయును, వృద్ధియు, హానియు పూజ్యముల్,సనా
తనమును, షడ్వికారరహితంబును, సూక్ష్మమునైన ఆత్మకున్
తనువు దెగంగనేసినను తాగునుగంతకయుండు అర్జునా !

ఆత్మతత్త్వము శాశ్వతమగుట ఇట్టు
లెరిగిన మహామనీషి తానెట్టులెవని
చంపు ? చంపించు ? దేహనాశనము నాత్మ
కెట్లు నాశనమనిఎంచు ? ఎంచిచూడు

జనుడు చినిగిన ప్రాత వస్త్రములనెట్లు
వదలి వలచిన క్రొత్త వల్వలు ధరించు,
అట్లు చివికిన ప్రాత దేహముల విడిచి,
ఆశ్రయించు నవీనదేహముల దేహి

ఆయుధము లెవ్వియును తెగ
నేయవు, హుతవాహనుడు దహింపడు దానిన్
తోయంబులు తడుపవు, రవి
వాయువు లెండింప, రిందువంశవతంసా !

నఱుక శక్యముకానిది, మఱియు గాల్ప,
దడుప, నెండింపరానిది ధన్వివర్య!
అనవయవి, ఆత్మ, అభవ మనామయంబు!
స్థాణు, వచలము, దివ్యము, సర్వగతము.

కరణములకు కనిపింపడు,
పరికింపగ పట్టుపడడు భావంబునకున్,
గురికాడు వికారములకు,
అరిసూదన! ఇట్టివాని కడలగనేలా ?

తలతువె దేహమునకు వలె,
కలవాత్మకు గూడ పుట్టుకయు జావనుచున్?
వలవని తలపవెయైనను
అలమట నీ కృడుగూడ ఆనుచితమందున్.

చావు నియతంబు పుట్టిన
జీవికి, పుట్టుకయు విగతజీవికి నియతం
బీ విషయము తప్పనిసరి
కావున నీవేడ్చి, కడపగలవే వానిన్

బ్రతికియుండగ గని భ్రమపడుటెకాని
పుట్టుకకు పూర్వమవి ఎట్టివో ఎఱుంగ,
మంతరించిన పిదప నేమగునొ తెలియ,
మట్టిప్రాణులగూర్చి నీ వడల వలెనె?

కనవినరానివింతవలె కన్గొను నాత్మనొకండు బుద్ధిచే,
పనివడి పెద్దవింతవలె పల్కునొకండు, కడింది వింతగా
వినును సవిస్మయుండొకడు; వేవురు చూచిన, పల్కినన్, కడున్
వినినను వారిలో దెలియనేర డొకండును దాని తత్త్వమున్.

శాశ్వతు, డవధ్యుడెప్పుడు సకల భూత
దేహగతుడైన దేహి, సందేహమేల?
అలమటించుట తగదు నీ కందువలన
పార్థ! లోకములోని ఏ ప్రాణికైన.

చలియింపరాదు నీ కిటు
కులధర్మము దలచికూడ కురువంశనిధీ!
అలఘుశ్రేయము నృపులకు
కలదే వేరొకటి ధర్మకదనము కంటెన్.

అరయ వివృతస్వర్గ
ద్వారం బనియనరె ఆహవము వీరులకున్,
కోరకయె ఎవరికిటులది
తారసపడు, వారుకారె ధన్యులు విజయా!

కయ్యమునకు నీవు కాల్దువ్వ, విధి ధర్మ
రణముగాన తప్పరాదు నీకు,
తప్పితేని, ఆత్మధర్మఫలంబును
యశము గోలుపడుదు వఘమువచ్చు.

ఇదియెకాక ఎల్లయెడల కొడై కూయు
నిఖిలభూతగణము నీయకీర్తి
చావు లెస్సగాదె నడికంటె నీవంటి
కీర్తనీయ విమలకీర్తిరతికి



తొలగితి పనినుండి భయా
కులమతివై యనుచు వీరకుంజర! నిన్నున్
చులకన చేయరె మునునీ
అలవు జలము బొగడినట్టి అతిరథులె ఇకన్.

అన్యాలోచననేల లెమ్ము, సమరాయత్తుండవై, వీరమూ
ర్ధన్యత్వంబున బొమ్ము, గెల్చిన మహీరాజ్యంబు నీ సొమ్మగున్;
జన్యక్షోణిహతుండవైన నొదవున్ స్వర్గంబు; నీకిట్లు రా
జన్యానేకపసింహా! రెండును ప్రశస్తంబుల్, మహోశాస్యముల్.

సకలసుఖదుఃఖములపట్ల జయపరాజ
యములపట్లను లాభనష్టములపట్ల
సమమనస్కుండవై భండనమున జోరుము
అట్లు చేసిన నిను పాపమంటుకొనదు.

ఆత్మతత్త్వావగమము నీ కలవరించి
తింతవరకు, ప్రబోధింతునిక అకామ
కర్మయోగము జ్ఞానమోక్షప్రదంబు
దాన విడివడు కర్మబంధములు నీకు.

వ్యర్థమై చెడ దిచట ఉపక్రమంబు,
నడుమ విడనాడినను చేటు పొడమదిచట,
ఆచరితమైన యీధర్మ మరయ నెంత
స్వల్పమైనను కాచు పెన్భయమునుండి.

వ్యవసాయాత్మకమై, ఇట
అవికలమగు బుద్ధియొకటి అవశ్యక; మ
వ్యవసాయిజనుల బుద్ధుల
కవధులు కనరావు, సాగునవి బహుళములై.

భవ్యసుపరలోకభోగానుభవముకంటె
భాగ్యమన్యములేదని పలుకుచుంద్రు
మోహనములైన మోదుగు పూలవంటి
వాక్యములుపెక్కు వేదార్థవాదరతులు.

భోగైశ్వర్యంబుల యెడ
ప్రేగగు తమితోడ, తదపహృత చేతసులై
సాగింతురు మూఢులు, గమ
నాగమనఫలప్రదంబులగు పెక్కుక్రియల్.

అలవడదు దైవచింతనయందు పార్థ
జన్మకర్మఫలక్రియా చరణమందె
గురిగలట్టి భోగైశ్వర్యనిరతులైన
అజ్ఞులకు నిశ్చయాత్మకమైనబుద్ధి

త్రిగుణాత్మకములు భారత!
నిగమంబులు కలవు కర్మనిష్ఠలుగానన్
సుగతికి నిరోధకములని
త్రిగుణములకు, ద్వంద్వముల కతీతుడవగు మీ!

అమృత ప్రవణంబగు వెం
దము యోగక్షేమముల నుదాసీనముగా,
రమియింపు, మాత్మరతివై
శమధుర్యుడవై, అజస్రసత్త్వస్థుడవై

ఎల్ల యెడల నీరు వెల్లువయైయుండ
బావివలన నెంతఫలము గలదొ ?
వైగమ ప్రయోజనమునంతియే సుమ్ము
భావితాత్ముడయిన కోవిదునకు

ఐహిక స్వర్గభోగపరాయణులకె
గ్రాహ్యములుగాని వేదభాగంబులైన
అర్థవాదాంశములు భారతాగ్రగణ్య !
కా వుపాదేయములు మోక్షకాముకులకు

కర్మమందె నీకు కలదధికారము,
కలుగదెపుడు దాని ఫలితమందు
కర్మఫలితమునకు గాకుము హేతువు,
తగ దకర్మమందు దగులు నీకు

నియతకర్మము లెస్సగ నిర్వహింపు
యోగనిష్ఠుడవై, సంగముజ్జగించి,
సిద్ధికి అసిద్ధికిని సమబుద్ధివగుము
అట్టి సమబుద్ధినే యోగమనిరి బుధులు

అధమకర్మము బుద్ధియోగాఖ్యమైన
గాఢసమబుద్ధి కొలబడ్డ కర్మమనఘ!
కాన సాధింపు బుద్ధియోగమును నీవు,
జడుడు, కృపణుడు ఫలమాసపడినవాడు.

బుద్ధియోగశాలి పుణ్యపాపంబులు
రెంటినిచ్చటనె పరిత్యజించు
కర్మమందు నేర్పుకలిమియె యోగము
క్రీడి! దాని నలవరించుకొనుము.

కర్మఫలముల దనకెట్టి కన్నులేని
ఉత్తమమనీషియగు బుద్ధియోగశాలి,
పొందు భవబంధములతోడి పొందు గెంటి,
అమృత మజర మనామయ మనుపదంబు.

వినుమెప్పుడు విలంఘించును
ఘనభుజ! నీబుద్ధి మోహకలిలంబును, నీ
కనపేక్షణీయ మప్పుడు
వినదగు విషయంబు, వినిన విషయము కూడన్.

వేదార్థశ్రవణంబుచే ఇటునటున్ విక్షిప్తమై, ఎంతయున్
భేదంబందిన బుద్ధి, నీకెపుడు నిర్వీచీమయాంబోధిమ
ర్యాదన్ నిశ్చలమై, సమాధి నచలంబై యుండునో, అప్పుడా
పొదిల్లున్ ఘనయోగరూపమగు జీవన్ముక్తి నీకర్జునా!

సమధికసమాధిమగ్నత
అమేయమగు ఆత్మదర్శనానందాభో
గమున స్థితప్రజ్ఞుడవై
రమింతువీవందు శమధురాధుర్యుడవై॥

4)

అర్జునుడు :

వనజవిలోచన! నీవిపు
డనినట్టి సమాధిమగ్నుడైన స్థితప్ర
జ్ఞనిలక్షణంబు లెట్టివి?
వినిపింపవె కరుణపల్లవింపగ నాకున్."

శ్రీభగవంతుడు :

విను, యెవడు తుడిచిపెట్టును
తనడెందములోని కామితంబులనెల్లన్,
తనయందె తన్నుగనుగొని
తనివొందునెవం డతడు స్థితప్రజ్ఞుడగున్

కష్టములకు మనంబున కలతపడక,
భౌతికసుఖంబులకు ఆసపాటువిడిచి,
రాగభయరోషములకు దూరముగనుండు
మునిపతంముని స్థితబుద్ధి యనగజెల్లు.

చెలికారమెందుజూపక,
అలవడిన శుభాశుభముల కలరకయుండున్
కలుషింపకుండునెవ్వడు
నిలుకడ వరియించు వానిని స్థితప్రజ్ఞన్.

అదన తాబేలు తనలోని కపయవముల
ముడిచికొను రీతి ఇంద్రియములను యోగి
స్పర్శములనుండి ఎపుడుపసంహరించు
అపుడు సుప్రతిష్ఠితమగు నతని ప్రజ్ఞ.

ఎనసిన ఇంద్రియార్థములు నింద్రియవర్గముచే భుజింపబో
కనశనుడైనవేళ విషయంబులు మాత్రము వైదొలంగు, నె
మ్మనమున వాని వాసనలు మాయవు దేహికి, మాయు నాత్మద
ర్శన పరమానుభూతిగను సంయమి కట్టిన! మూలముట్టుగన్.

మనసు నింద్రియములును తమంత తామె
వశములై యుండు, బ్రహ్మానుభవము బడయ
గల స్థితప్రజ్ఞునకు గాన కలుగ దతని
కెట్టి విషయాభిలాషయు హృదయమందు

ఎంత ప్రయత్నించిన విను
మెంతయు బల్లిదములైన ఇంద్రియములు ధీ
మంతుని మదినైనను బల
వంతముగాలాగు విషయవర్గము దెసకున్.

వాని నన్నింటి పగ్గాలు వైచి పట్టి,
యుక్తుడును, మత్పరుండునై యుండవలయు;
ఎవని కడగోలు పడియుండు నింద్రియములు
వాని కొదవు స్థితప్రజ్ఞాతానిరూఢి.

విషయములను పట్టువిడక చింతించిన
వానిమీద గలుగు వలని తగులు;
తగులు వలన కోర్కి చిగురించు, కోరిక
వలన క్రోధలోభములు జనించు.

క్రోధలోభముల నిగుడు భూరిమోహము
మోహవశత మఱపుపుట్టు మతికి
మఱపువలన బుద్ధితఱిగి నశించును
బుద్ధి నాశనమున బొలియు నరుడు.

విరహిత రాగద్వేషుకు
స్థిరనిగ్రహీతేంద్రియుడు, విధేయాత్ముడునై
పురుషుడు విషయాంతరముల
చరించుచున్నను మనఃప్రసాదము నొందున్

పరవీర! యాప్రసన్నత
పొరిగొను దుఃఖము లశేషముగ పురుషునకున్,
పరమాత్మ మీద నెలకొను
సరగున తద్బుద్ధి సుప్రసన్నాత్మునకున్.

అనఘవిచార! ఆత్మవిషయంబగు బుద్ధియు, సమ్యగాత్మభా
వనయు జితేంద్రియుండయిన వానికిగాని లభింప; వాత్మభా
వనకొఱవడ్డచో వికృతివర్జిత శాంతియు గల్గబో, దనం
జనము గు సౌఖ్యమెక్కడిది దశాంతమనస్కున కెవ్విధంబునన్.

విషయముల జరించు వివిధేంద్రియములలో
జనుని మనసు దేని ననుసరించు,
హాని దెచ్చిపెట్టు నది వాని ప్రజ్ఞకు
కడలినావ కెదురు గాలివోలె.

కరణముల నెల్ల విధముల
అరికట్టును, విషయముల మహోకర్షణకున్
గురిగానీయక ఎవ్వడు,
స్థిరపడి. తత్ప్రజ్ఞ చెక్కుచెదరక యుండున్.

ప్రాణులకునెల్ల చీకటిరాత్రి యేది,
అందుమేల్కొనియుండు సంయమిజనంబు
ఎందు ప్రాణులు మేల్కొని యుందురెపుడు,
రాత్రియది ఆత్మదర్శన రతికి యతికి.

వినుము నదీనదోదకము వెల్లువలన్నియు జొచ్చి, మేరమీ
రని పరిపూర్యమాణజలరాశి నడంగవె సవ్యసాచి! ఆ
యనువున జొచ్చి, భోగ్యవిషయావళి ఎవ్వనిలో నడంగు, నా
యనఘుడు శాంతినొందు, అది అంబరపుష్పము కామకామికిన్.

పరిహృత సమస్తకాముడు,
నిరీహుడును, నిర్మముండు, నిరహంకృతియై
చరియించునెవ్వ, డాతని
అఱచేయుసురికయె శాంతి అనవగ్రహమై.

ఇది బ్రాహ్మీస్థితి, వాసనావిరహితం, బీనిష్ఠ సాధించినన్
మదినమ్మోహము మాయు మాయమగు సంసారవ్యళీకంబులున్
తుది ప్రాణంబున నున్నవాడయిన బొందున్ బ్రహ్మనిర్వాణసం
పద దన్నిష్ఠుడు, పట్టు కొల్పుమిది భావంబందు పౌరందరీ!



# తృతీయాధ్యాయము

## కర్మ యోగము

అర్జునుడు :

"కర్మమునకంటె ఎక్కుడు
నిర్మలమగు జ్ఞానమనియె నీ మతమైనన్,
నిర్మూలన కరమగురణ
కర్మమునకు బనుతువేల కంసారి! ననున్.

వాసుదేవ! వ్యామిశ్రము వంటి నీదు
పలుకు నా బుద్ధి దికమక పఱచెగాన,
దేనిచే నాకు మేలు సిద్ధింపగలదొ
అట్టి యేకైక మార్గము నానతిమ్ము."

శ్రీ భగవంతుడు :

సముచితనిష్ఠలంచు మును సంచితవిక్రమ! తెల్పియుంటి, నా
ల్యమునసె జ్ఞానభూమికల నందిన సాంఖ్యులకెల్ల జ్ఞానయో
గమును, మనోవిశుద్ధి కడగాననివి యోగులకెల్ల కర్మయో
గమును; ప్రకారభిన్నములుకాని, నిజంబవి ఏకగమ్యముల్.

కురువీర! అవి పరస్పర
నిరపేక్షములైన రెండు నిష్ఠలుగానే
నెఱిగింపలేదు, జ్ఞానము
పరిపూరకమగును కర్మపథమున కరయన్:

అనఘ! ఆత్మావలోకనమునకు చరమ
సాధనంబుగ జెప్పితి జ్ఞాననిష్ఠ,

జ్ఞాననిష్ఠకు బాట నిష్కామకర్మ
నిష్ఠయనియంటి, అది గమనింపుమిపుడు.

ఫలములు గోరక కర్మం
బులునడపిన సాధకునకు మును చిత్తము ని
ర్మలమగు, పదపడి జ్ఞానం
బలవడు అది చేర్చునతని నాత్మస్థితికిన్.

గాఢ నిష్కామకర్మమార్గంబు తుట్ట
తుదకు జని, జ్ఞానమార్గము ద్రొక్కి, దాని
మీదుగా చేరదగుగాని లేదు పార్థ!
అమృతపదవికి తలచుగా అడ్డుదారి.

పరిణత పరిశుద్ధాంతః
కరణులకే జ్ఞాననిష్ఠ కర్తవ్యమగున్,
కరణీయము మలినాంతః
కరణులకెల్లను, అకామకర్మమె విజయా!

కర్మము నుపక్రమింపని కతన గలుగ
దనఘ! నైష్కర్మ్యమైన ఆత్మానుభూతి
జ్ఞానసిద్ధియు, ముక్తియు గానలేడు
నరుడు కేవలబాహ్యసన్న్యాసమునను.

చేయకయుండడు కర్మము
ఏయొకక్షణకాలమయిన ఎవ్వండయినన్
చేయింపకుండ విడువవు,
స్వాయత్తుని వాని ప్రకృతిజన్యగుణంబుల్.

భరపడి నిజేంద్రియంబుల
నరికట్టి, మనంబు నింద్రియార్థంబులకున్
గురిసేయు విమూఢాత్మకు
డరిసూదన! వినుము, దాంభికాచారుడగున్.

ఎవ్వడు మనోబలమున జ్ఞానేంద్రియముల
అదుపులోనుంచి, కర్మేంద్రియములతోడ
కడగు, నిర్ముక్తసంగుడై, కర్మయోగ
కరణమునకు, మహోత్తమపురుషుడతడు.

నియతకర్మము నడపుము నీవు నెమ్మి,
కర్మనడపుట మానుటకంటె మేలు,
అర్జున! అకర్మకరణుడవైననీకు
చక్కఁగ శరీరయాత్రయు సాగబోదు.

మహితయజ్ఞార్థమయినకర్మంబుతప్ప
కడమకర్మము కర్మాధికారికెపుడు
బంధకముగాన, సంగము బరిహరించి,
నడపుమీ కర్మమీవు యజ్ఞంబుకొరకె

మునుపు యజ్ఞముతోబాటు వనజభవుడు
ప్రజలను సృజించి వారితో పలికెనిట్లు
దీనిచే మీరు బ్రతుకుడు, తీర్చునిదియు
కామధేనువుకరణి మీకామితముల.

దేవతల తృప్తిపఱచుడు దీనిచేత,
తృప్తిపఱతురు మిమ్మునా దేవతలును
ఈగతి పరస్పరముగ సంతృప్తినొంది
పడయుదురు మీరువారును పరమశుభము.

యజ్ఞపరితృప్తులై ఇత్తురవిరళముగ
వలయు భోగభాగ్యములు దేవతలు మీకు,
తిరిగి దేవతలకు నివేదింపకుండ
వాని భుజియించువాడు కేవలముదొంగ.

సుజనుండు యజ్ఞశేషము
భుజియించి, సమస్త పాపముల కెడబాయున్
భుజియించు పాతకములనె
కుజనుడు తనకొఱకె వండుకొనువాడగుటన్.

అన్నంబునుండి భూతము
లన్నియు జనియించు, వాన లన్నము నొసగున్,
జన్నమున గురియువానలు,
జన్నము వర్తిల్లు కర్మసంజనితంబై.

నిగమోదితంబు కర్మము,
నిగమము బ్రహ్మోద్భవంబు, నిరతంబటుస
ర్వగమైన పరబ్రహ్మము
జగ జన్నముననె ప్రతిష్ఠితంబై వెలుగున్

ఎడతెగక ఇట్లుకొనసాగు ఈసమగ్ర
ధర్మచక్రము పాపకృత్యముల దగిలి,
ఇంద్రియారాముడై ఎవ్వడెఱుకమాలి
అనుసరింపడు, వాడొక వ్యర్థజీవి.

జనుడెవ్వ డాత్మయందే
తనివొందును, సంతసించు, తగిలి రమించున్,
విను, మంతర్ముఖుడగునా
ఘనునకు లేదింక కార్యకర్మము విజయా!

స్వాకృతమునకు మేలును, మరి
అకృతమునకు గీడు శూన్య మాత్మజ్ఞునకున్.
సకలభువనముల బనిలే
దకుతోభయు డతనికొకని అర్థాశ్రయమున్.

కేవలముక్తుడైన యతికే కాబగావికనెట్టి కర్మములన్,
నీవు సమాయముక్షుడ, వనిశ్చితబుద్ధివి, మోక్షకామివిన్
కావున సర్వదా నియతకర్మము సేయుము, మసక్తబుద్ధివై,
జీవు డసక్తకర్మములు చేసిన జెందు బరంబు భారతా!

ఔను కర్మాచరణమున నె
జనకాదులు కాంచిరాత్మసాక్షాత్కృతి, నీ
వును వారి యడుగుజాడల
జనదగు కౌంతేయః లోకసంగ్రహబుద్ధిన్.

ఏమేమి సేయు శ్రేష్ఠుడు
పామరులాచరింతు రదియె పరమాసక్తిన్
ప్రామాణికముగ నెయ్యది
ఆ మేటికి, దానిలోక మనువర్తించున్

అందరానిది లేదు, నాకంద దగిన
యదియులేదు, త్రిలోకమునందు నెందు
ఎట్టి కర్జము లేదైననేమి, కర్మ
కరణమందె నిమగ్నుడగానె నేను.

నా ముఖ్యకర్మమును, నే
నేమరకే ప్రొద్దు నిర్వహింపకయున్నన్
భూమిజను లదియెసాకుగ
నా మార్గము ననుసరించి నడతురుపార్థా!

చెడిపోవు గర్మ సంచయ
మెడపక నావిహితకర్మ మెల్లప్పుడు నే
నడపనియెడ; ఈ లోకుల
చెడగొట్టిన వాడనగుదు చేసేతగడున్.

సామాన్యులెట్లు కర్మము
వ్యామోహితులై యొనర్తు, రవ్విధమున ని
ష్కాములయి చేయదగు, ప్ర
జ్ఞామహితులుకూడ లోకసంగ్రహ నిరతిన్.

బుద్ధిచలనము బుట్టింప బూనరాదు
పండితుడు కర్మపరులైన పామరులకు
తాను నిష్కామకర్మ తత్పరత నాత్మ
వంతుడై ప్రేరకుండు కావలయుగాని.

భారత। ప్రకృతిగుణంబులు
కారణముగ జరుగు సకలకార్యము లైనన్
ఆరోపించికొను నహం
కారవిమూఢుండు తనకె కర్తృత్వంబున్.

కాని, గుణకర్మముల విభాగమున దత్త్వ
వేత్తయగువాడు వర్తించు విషయరూప
గుణములందు ఇంద్రియరూపగుణములనుచు
దలచి, కర్మములందసక్తత వహించు.

ప్రకృతిగుణములచేత నెవ్వరు విమూఢు
లగుచు గుణకర్మములలోన దగిలియుందు,
రాత్మవిదు డాఅనాత్మజ్ఞులైన మంద
మతుల విచలింప జేయక మార్పవలయు.

ధర్మాధర్మాదిసకల
కర్మలు నాపరముజేసి కలనికిదిగుమో
ధార్మికవర్య! నిరాశివి
నిర్మముడవునగుచు ఆత్మనిష్ఠిత బుద్ధిన్.

అనయం బనసూయత, ఏ
జనములు నాయీమతంబు శ్రద్ధాపవృత్తై
అనువర్తింతు రవశ్యము
కననేర్తురు వారుకూడ కర్మవిముక్తిన్.

కాని, నను బరిహసింపుచు
ఈ నా మత మనుసరింప రెవ్వరు, సర్వ
జ్ఞానవిమూఢాత్ములు, మతి
హీనులునై వారు చెడుదురెల్ల విధములన్.

తన జన్మాంతరసంస్కృతి
కనుగుణముగ నెంతజ్ఞానియైన చరించున్:
జనులకు సహజంబు ప్రకృ
త్యనుయానముగాన, నిగ్రహము కొఱయగునే?

నియతములై యుండు ప్రియా
ప్రియములు సకలేంద్రియముల విషయంబులలో
భయదరిపులగుట వానికి
కయివసుడగు టెన్నటికి దగదు పురుషునకున్.

విగుణంబయ్యు స్వధర్మమె
తగు, సువిహితమైన పరుల ధర్మముకంటెన్:
తెగుటయు మేలు, స్వధర్మ
ప్రగతికి, భయదుఃఖదములు పరధర్మంబుల్.

అర్జునుడు:

వలవకయున్నను, భృత్యుని
వలె మిగుల బలాత్కరింపబడి పాపంబుల్
సలుపునరుం, డడియే ప్రో
ద్బలమునకున్ లొంగి యదువతంసమ! చెపుమా!

శ్రీభగవంతుడు :

భారతరత్న! రజోగుణ
కారణమున దాపురించు కామంబును, తద్
ద్వారమునబుట్టు క్రోధము
ప్రేరకములు నరుని పాపకృత్యంబులకున్.

మలమద్దంబును, మావిపిండమును, ధూమంబగ్నిహోత్రున్, నభో
జలదానీకము భానుబింబమును ప్రచ్ఛాదించు చందంబునన్,
కలయన్ జ్ఞానము నావరించు దళమై కామంబు కౌంతేయ! బి
ట్టలచున్ జ్ఞానిని వైరియై, అనలమై, అత్యంతదుష్పూరమై

వినుము కామమునకు మూలపీఠమనిరి,
ఇంద్రనందన! మనసు, బుద్ధీంద్రియములు,
జ్ఞానమునువాని ప్రాపునగప్పి, మోహ
వశునిగావించునది ఎంతవానినైన

కావున ధనుర్ధరోత్తమ! నీవుతొలుత
నీమనసు, నింద్రియములను నిగ్రహించి,
జ్ఞానవిజ్ఞానముల మాప్రు గాఢపాప
రూపమగు కామమును రూపుమాపవలయు.

మిన్నలందు రింద్రియములు మేనికంటె,
సమధికమునుమ్మ మదిఇంద్రియములకంటె,
బుద్ధి మదికంటెగొప్పది, బుద్ధికంటె
అరయ నుత్కృష్టతరుడెవ్వ దతడె ఆత్మ.

అట్లుబుద్ధికంటె నతిరిక్తుడని యాత్మ
నరసి, సారబుద్ధియండతోడ
మనసు నదుపులోననునిచి, జయింపుము
కామరూపుడైన కడిదిరిపుని.

# జ్ఞానయోగము

శ్రీభగవంతుడు :

"కర్మసాక్షికి మున్ను కరపితి నిష్కామ
కర్మయోగమును జగత్ప్రియముగ;
మార్తాండుడెఱిగించె మనువున, కతఁడును
నందను డిక్ష్వాకునకు నొసంగె;

రాజర్షులు పరంపరాప్రాప్తమగుదీని
నభ్యసించి, కృతార్థులైరి పార్థ!
బహుళప్రచారలోపంబున నేఁడిది
కలియనున్నది కాలగర్భమందు;

కాన నిమ్మరికరపితి గారవమున
భక్తుఁడవు, బంధుఁడవును గాబట్టినీకు,
అవ్యయంబును, పరమగుహ్యంబునైన
ఈపురాతననిష్ఠ నీహితము గోరి."

అర్జునుడు:

"దినకరుడుపుట్టి యుగములు
చనియెగదా, నిన్నమొన్న జనియించిన నీ
వినునకు మున్నిది కఱపితి
వనినన్ నమ్మెటు గ్రహింపు మందువుకృష్ణా!"

శ్రీభగవంతుడు :

నీకును, నాకును, జన్మ ల
నేకంబు లతిక్రమించె నిప్పటివరకున్,
నీకవి జ్ఞాపకముండవు
నాకన్నియు నవగతములె నాకేంద్రసుతా!

అజుడనైన, అవ్యయాత్ముడనైనను,
లోకములకు మహేశ్వరుండనైన,
భరతవీర! నాదుప్రకృతినిలోగొని,
ఆత్మమాయచేత అవతరింతు.

ఎప్పుడు ధర్మమునకు పెను
ముప్పుకలుగు, మరి అధర్మమున కభ్యుదయం
బుప్పతిలు, తడయకప్పుడు
తప్పక నాయంతనేనె తగనుదయింతున్,

ధార్మికుల నరసి మనుపగ,
దుర్మార్గచరిష్ణువులను దుదముట్టింపన్,
ధర్మమునెలకొల్ప, అలం
కర్మీణుడనగుచు, యుగయుగమున జనింతున్.

వినుమిటు దివ్యములగు నా
జనికర్మల తత్త్వమెఱుగజాలు మనీషుల్
తనుపతనానంతరమున
పునర్భవముగాదు, నన్నెపొందుదు రనఘా!

భయమును, రాగము, క్రోధము
స్మయమును దిగనాడి, నాకు సంశ్రితులై, మ
న్మయులైన జ్ఞానతపసులు,
ప్రయతులు మును కనిరి నాదు భావమునేకుల్.

ఎవ్వరేరీతి నన్నాశ్రయింతు, రెఱిగి,
వారి నారీతి గరుణింతు వాడనేను;
విను, మదీయపథానువర్తనులె సుమ్మ
జనులు సర్వవిధంబుల సవ్యసాచి!

కృతకర్మములకు ఇచ్చట
ప్రతిఫలములుఁగోరి, నరు లుపాసింతురు దే
వతలను; నరలోకంబున
అతిరయమున కర్మఫలము లలవడు కతనన్.

వినుము గుణకర్మవిభజన ననుసరించి,
వర్ణములు నాల్గునేనె ఏర్పఱచినాడ,
అనఘ! దానికి నేగర్తనైన నన్ను
అరసి చూడు మకర్తగా అవ్యయునిగ.

కర్మలు నన్నంటవు, మరి
కర్మఫలానక్తి నాకు కలుగదు, నా యీ
మర్మము నెఱిగిన పురుషుడు
కర్మములకు గట్టువడడు కౌరవ్యమణీ!

ఈ విధమెఱిగియె కర్మము
కావించిరి లోంటి ముక్తికాములు కూడన్
కావున నడవుము పూర్వులు
కావించిన యట్లకామకర్మమె నీవున్.

కర్మ ఇట్టిది, ఇట్టి దకర్మయనగ
పండితులుకూడ తికమకపడిరి పార్థ!
కాన ప్రవచింతు తెలియుము వాని తెఱగు
ఆ తెలివి నీకు బంధము నపయించు.

కర్మ విధివిహితచర్య, వి
కర్మ నిషిద్ధంపుపని, అకర్మయనంగా
కర్మాభావము, కర్మవి
కర్మాకర్మముల గతులు గహనములరయన్.

కర్మములోన అకర్మను
కర్మమును అకర్మలోన గనుగొనునెవ. డా
కర్మజ్ఞుడెయోగి, సకల
కర్మానుష్ఠానకరుడు, ఘనకోవిదుడున్

నియతకర్మము నడపుచుండియు నెవండు,
తోచు తలపులనెల్ల తోడ్తోడగెంటి,
నిశ్చలముగ మనంబును నిలుపగలుగు
కర్మమున వాడకర్మము గను కిరీటి!

కడగి, ఏ బాహ్యకర్మము నడపకున్న
బ్రహ్మచింతనా రూపకర్మ ప్రవాహ
మెడతెగక పాఱునెవనిలో నెల్ల ప్రొద్దు
కర్మమును వాడు చూచు నకర్మలోన.

ఏ నరుని సకలసదను
ష్ఠానములు నిరస్తకామసంకల్పంబుల్,
జ్ఞానాగ్నిదగ్ధకర్ముని
వాని మహాపండితునిగ వచియింత్రు బుధుల్.

కర్మఫలతృష్ణ విడిచిన
నిర్మముడు, నిరాశ్రయుండు, నిఃఖేదుడు, తా
కర్మమున మగ్నుడైనను
కర్మణ్యవరేణ్యా! కర్మికాడించుకయున్.

నియతచిత్తేంద్రియుండగు నిర్వికారి,
త్యక్తసర్వపరిగ్రహుండగు నిరాశి,
మనుగడకు, లోకసంగ్రహమునకు కొంత
కర్మ నడపియు, పాపసంగతుడు కాడు.

అనుచిత మాచరింపక, అయాచితలబ్ధము తోడ, సర్వదా
తనివి వహించి, ద్వంద్వములుదాటి, మనంబున నీసు రోసకమున్
జొనుపక, సిద్ధి చొప్పడిన చొప్పడకుండిన తుల్యుడైన యో
గనిరతు, డాత్మవేది, నిజకర్మనిబద్ధుడు కాడు చేసియున్.

సంగరహితుడు, ముక్తుడు, జ్ఞాననిష్ఠి
తాత్ముడెవ్వడు, వానియజ్ఞార్థమయిన
కర్మకాండమశేషము కనులయంబు
కనక మిగులవు వాని వాసనలు కూడ.

బ్రహ్మమె యజ్ఞ భాజనము, బ్రహ్మమె యజ్ఞహవిస్సు, యజ్ఞమున్
బ్రహ్మమె, యజ్ఞపావకము బ్రహ్మమె, యజ్వయు, సభ్యవర్గమున్
బ్రహ్మమె, ఇట్లు సర్వమును బ్రహ్మమయంబని చూచు ఆ పర
బ్రహ్మవిదగ్రగణ్యునకు బ్రహ్మమె గమ్యము కూడ ఫల్గునా!

భక్తియోగులు కావింత్రు పార్థ! దైవ
యజ్ఞమును, దైవతోపాసనాదికముల,
జ్ఞానయోగులు బ్రహ్మయజ్ఞము నొనర్తు
రనఘ! తమ చిత్తమును బ్రహ్మమునలయించి.

ఆహుతులుసేయు, తన ఇంద్రియముల, నిగ్ర
హాగ్నులకు, ఆత్మసంయమయజ్ఞకరుడు;
విషయముల, నింద్రియాగ్నులవేల్చునితరు,
డనఘ! విషయపరిత్యాగయజ్ఞమందు.

యావదింద్రియకర్మల, ప్రాణకర్మ
యుక్తముగవేల్తురు సమాధియోగరతులు,
జ్ఞానవిజ్ఞాన సందీప్తమానమైన
ఆత్మనిగ్రహనామయోగాగ్నిలోన.

ద్రవ్యదానము, తపము, అధ్యయన నిరతి,
జ్ఞానసంపాదనము, యోగసాధనయును
యజ్ఞమనుబుద్ధి నడపుదు రలఘుయత్న
పరులు నిస్స్వార్థసంశ్రితవ్రతులు పార్థ!

ప్రాణమున అపానంబును
ప్రాణమును అపానమందు ఆహుతి సేతుర్
ప్రాణాయామప్రసితులు
ప్రాణాపానముల గతుల నరికట్టి తగన్.

నియతాశనులై వేల్తురు,
ప్రయతాత్ములు ప్రాణములను ప్రాణంబులలో,
నియతాశనతయు యజ్ఞ
క్రియగా వీరెరిగి విగతకిల్బిషులగుదుర్.

యజ్ఞశేషామృతము నెవ్వడారగించు,
పడయువాడు సనాతనబ్రహ్మపదము,
యజ్ఞమొకదానినైన చేయని జనునకు
ఇహసుఖమునున్న, పరసుఖమెచటిదన్న!

వివిధములగు యజ్ఞంబులు
వివరముగ వచింపబడియె వేదములోనన్.
ప్రవిముక్తుడ వగుదువు నీ
వవియెల్లను కర్మజంబులని ఎరిగినచో.

జ్ఞానాత్మకయజ్ఞమె, ఘన
మైనది ద్రవ్యమయము యిన యజ్ఞముకంటెన్
లీనమయి, ముగియు, విమల
జ్ఞానమున సమస్తకర్మచయ, మఖిలంబై

దాని దెలియుము జ్ఞానవిత్తములనుండి
ప్రణతులను, సేవలను, పరిప్రశ్నములను
అలవరింతురు నీవినయమున కలరి
జ్ఞాన మఖిలంబు తత్త్వదర్శనులు వారు.

ఆమహాజ్ఞాన మవగత మయ్యెనేని
బుద్ధిమోహము నీవింకపొందబోవు
సృష్టినంతయు నీవుదర్శింపగలవు
అపుడునీయందు, అట్లె నాయందుగూడ.

పాపాత్ములలోన మహా
పాపివి నీవయినగూడ పనిలేదడలన్;
పాపాబ్ధిగడవ నీదగ,
తేవయగున్ నీవుకన్న తెప్పయెనీకున్.

ఎండినకట్టెల దరికొని
మండుమహాగ్నివలె, బోధమహనీయుల ఉ
ద్దండ జ్ఞానజ్వలనము
పాండవ! తత్కర్మపటలి భస్మము సేయున్.

జ్ఞానసదృశము, పవిత్రము
కానము వేరొకటి నిజముగా నిజ్జగతిన్,
దాని దృఢయోగసిద్ధుడు
తానే తనయందు పెద్దతడవున కెఱున్.

జ్ఞానమువరించు శ్రద్ధయు,
పూనికయు, జితేంద్రియత్వమును గలవానిన్,
వానికి చేపడు ఆత్మ
జ్ఞానముతోబాటు పరమశాంతియు విజయా!

విహితశ్రద్ధయు, జ్ఞాన
స్పృహయును కొరవడిన సంశయితుడు నశించున్
బహుగుణః సంశయచిత్తున
కిహపరములలేవు, సౌఖ్యమొక్కఁడిడింకన్.

యోగినై, కర్మఫలముల నూజ్జగించి,
జ్ఞానినై మదిలోని సంశయములుడిగి,
ఆత్మయందు ప్రతిష్ఠితుడైనవాడు
కర్మశృంఖలముల చేత గట్టువడడు.

కానదడవేల, నీయ
జ్ఞానమనోజనితమైన సంశయలతికన్
జ్ఞానాసిదునిమి, యోగము
బూనుము, రణమునకులెమ్ము భుజవీర్యనిధీ!



# పంచమాధ్యాయము

## కర్మసన్న్యాసయోగము

అర్జునుడు :

కర్మసన్న్యాసమును పేర్కొని వచించి,
కార్యమందువు కర్మయోగమును మరల,
కృష్ణపరమాత్మ! ఏది యీరెంటిలోన
అధికశుభదాయకమొ తెల్పి యానతిమ్ము.

శ్రీ భగవంతుడు :

కర్మసన్న్యాస కర్మయోగములు రెండు
సమముగ విముక్తికరణకల్యములె యైన
నా మదికి కర్మసన్న్యసనంబు కంటె
సమధికము కర్మయోగము సవ్యసాచి!

ద్వేషమును కోరికయులేని ధీరుడెవడు,
నిత్యసన్న్యాసియనియె గణింపుమతని,
విడివడునుగాదె సుఖముగ వీరతిలక!
ద్వంద్వరహితుడు సకలబంధములనుండి.

జ్ఞానయోగము కర్మయోగమును వేఱు
వేఱని వచింత్రజ్ఞులు, విబుధులనరు,
వానిలో నెన్నగా దేనినైన నడపి,
పడయగా వచ్చు రెండిటి ఫలము నరుడు.

జ్ఞాననిష్ఠునకే మహాస్థాన మబ్బు!
కర్మనిష్ఠుడు సైతము కాంచుదాని,
జ్ఞానకర్మయోగముల నొక్కటిగ ఎవడు
చూచునో వాడె నిజమును చూచువాడు.

కర్మయోగము నడపక కలుగుటరుదు,
కర్మసన్న్యాస పూర్వక జ్ఞాననిష్ఠ,
కలుగు నిశ్చల నిస్స్వార్థ కర్మయోగి
యగుమునికె సత్వరముగ బ్రహ్మానుభూతి.

అఖిలభూతాత్మలందు నిజాత్మజూచు
నియతచిత్తుడు, నిర్జితేంద్రియుడు, విమల
మానసుడు కర్మయోగి కర్మములనెన్ని
ఆచరించియు, వానిచే అంటబడడు.

కను, విను, పల్కు, తాకు, తిను. కన్మూయుచున్, కనుమూయు, గాలిపీ
ల్చును, నిదురించు, పిల్చు, నడచున్, తన చేసిన దించుకైన తే
దనియు, నిజేంద్రియంబులు తదర్థములంజరియించుచున్న వ
ట్లనియుచలంచు; తత్త్వవిదుడైన నిరంతరయోగి అర్జునా!

తన పనులెవ్వియు బ్రహ్మ
ర్పణమతితో నడప స్వార్థరాహిత్యముతో
విను, మతని దురితమంటదు,
అనఘాత్మక! నీరు తామరాకును బోలెన్.

తనువుతో, బుద్ధితో, నిండుమనసుతోడ,
మమత మాలిన తన ఇంద్రియములతోడ,
కార్యకర్మము సాగించు కర్మయోగి
ఆత్మశుద్ధికి తగులము నపనయించి.

విను, మట్టివాడు యుక్తుం
డనబడు, కౌంతేయ! భగవదర్థము కర్మం
బొనరిచి, నైష్ఠిక శాంతిం
గను నాతడు, జనన మరణగతులకు దొలగున్.

బలవత్కామప్రేరణ,
ఫలసంగముతోడ, కర్మపరులైన అయు
క్తులు గమనాగమనంబుల
అలయుచు సంసృతినిబద్ధులగుదురు విజయా!

సకలకర్మల మనసుచే సన్న్యసించి,
పూర్ణ సుఖియై, నవద్వారపురము వంటి
దేహముననుండు వశియైన దేహధారి
ఏమియును చేయబోక, చేయింపబోక.

కలిగింపడు కర్తృత్వము,
కలిగింపడు కర్మములను, కర్మంబులకున్,
ఫలయోగము పరమాత్ముడు
కలిగించు కిరీటి! ప్రకృతిగంధమె వానిన్.

పరమాత్మ స్వీకరింపడు,
పురుషుని పాపమునుగాని, పుణ్యముగానీ,
మరి అజ్ఞానమె, జ్ఞానా
వరణంబై, వాని మోహవంతుని జేయున్.

జ్ఞానంబు పుంజుకొని, అ
జ్ఞానంబు సమూలముగ వినాశితమయినన్,
భానుని భంగి దదాత్మ
జ్ఞానమె బ్రహ్మమును సుప్రకాశితు జేయున్.

కనిమెదదు తన్మతులు, త
న్మనస్కులు, తదేకగతులు, తత్తత్పరులున్
పునరావృత్తి రహితమగు
అనామయపదంబు, జ్ఞానహతకల్మషులై

విద్యయు, వినమ్రతయుగల్గు వేదవిప్రు,
గోవు, నేనుగు, కుక్కను, కుక్కదినెడి
నరులుమాలని, సరిసమానముగజూచు,
బ్రహ్మమును వారిలో జూచుపండితుడు.

పరిణతిగన్న సర్వసమభావము నిండుమనంబులోన ఎ
వ్వరికి ప్రతిష్ఠితంబగునొ, వారిహమందె సజీవులై, భవాం
తరము నతిక్రమింతురు, ధనంజయ! పీలసమస్తదోషులై
పరగు సమస్వరూపమగు బ్రహ్మమునందె వసింత్రుకావునన్.

ప్రియముగని సంతసింపరు,
భయపడ రప్రియముగాంచి, బ్రహ్మజ్ఞులు, సం
శయరహితులు, స్థిరబుద్ధులు,
నియతంబుగ బ్రహ్మమందె నిలకడగనుటన్.

బాహ్యవిషయాభిరుచిలేని పండితుండు
ఆత్మలో ఏసుఖంబు దాననుభవించు,
ఆసుఖంబునె పడయుదా నక్షయముగ
బ్రహ్మయోగయుక్తాత్ముడై పరగుయోగి.

విషయసుఖంబులు దుఃఖక
లుషయోనులు, మొదలుతుది కలుగునవికావున్

ధిషణావంతులు దుష్టా
మిషములుగా వానితోరమింపరు విజయా!

తనువు చాలించుటకుమున్నె వినుమెవండు
తామసమమాని ఇచటనె కామకోప
జనితవేగము నరికట్ట శక్తుడగునొ
వాడెయోగియు, వశియును, వాడెసుఖియు.

ఆత్మయందె సుఖించుచు, ఆత్మయందె
పవలురేయి రమించునెవ్వడు కిరీటి!
కాంచునట్టి అంతర్జ్యోతిగలుగువాడె
బ్రహ్మనిర్వాణమును, బ్రహ్మభావమంది,

విరజస్తములై కందురు
విరహితసంశయులు, సతతవిశ్వశ్రేయో
నిరతులు, నియంత్రితాత్మలు
నిరవద్యులు, ఋషులు, బ్రహ్మనిర్వాణంబున్.

పరమబ్రహ్మానందం
బఱచేతిదిగాదె ఇందునందు యతాంత ;
శరణులకు, యతుల, కరిష
డ్వైరహితులకు, నిత్యతృప్త విదితాత్మలకున్.

వెలుపలికి బాహ్యవిషయం
బులనన్నిటిగెంటి, చూపు బొమలనడుమనే
నిలుపుచు, ప్రాణాపానం
బుల రెంటిని సమముజేసి ముకు చెరమలలోన్.

బలవన్మనోమతీంద్రియ
ముల నాజ్ఞావశులజేసి, మోక్షపరుండై
అలుకయు, వెఱపును, గోర్కియు
తొలియించిన ముని సదా విముక్తుడె విజయా!

సవనతపఃఫలభోక్తగ,
భువనమహేశునిగ, సకలభూతసుహృద్బాం
ధవునిగ నను గుర్తించిన,
భవబంధములుడుగు, యోగి పడయు ప్రశాంతిన్



# షష్ఠాధ్యాయము

# ఆత్మ సంయమయోగము

శ్రీ భగవంతుడు :

కర్మఫలమున తనకెట్టి కష్టి లేక,
నియతకర్మము నెవ్వడు నిర్వహించు,
అతడె సన్న్యాసి, యోగియునగు నతండె,
అర్జున! అనగ్నికాడు, కాదక్రియుడును.

అరయ, సన్న్యాసమని దేనినందు, ఏదియె
గాఢనిష్కామకర్మయోగంబు కూడ,
సర్వసంకల్పసన్న్యాసశాలికాని
వ డెవడు కర్మయోగి కాలేడు కాన.

వినుము, యోగాధిరోహణమునకు, విహిత
మార్గమందు రకామకర్మమును బుధులు:
అట్లు యోగసమారూఢుడైన మునికె
జ్ఞానపరిపాకహేతువు కర్మశమము.

ఫలనిరపేక్షియై విహితపద్ధతి నెవ్వడు కార్యకర్మమున్
నడపుచునుండు, వానికి మనఃపరిశుద్ధిలభించు, దానితో
అలవడు ఆత్మనిష్ఠ, తదనంతర మాతనినుండి తామెపై
వాలగును కర్మముల్, సులిచి త్రుంపకరాలిన పండుటాకుపై.

ఎల్ల విషయాంకురములను గిల్లివేసి,
కర్మముల మీది తగులము కట్టిపెట్టి,
సర్వ సంకల్పములనెవ్వ సన్న్యసించు
అపుడె యోగసమారూఢు డగు నరుండు.

జనుడు తనయాత్మచేతనె
కొనకొని తన్నుద్ధరించుకొనవలె, ఆత్మన్
జనదు బలహీన పరచుట,
తనయాత్మయె తనకు హితుడు దాయయుగాసన్.

ఆత్మబలమున దేహేంద్రియముల గెలుచు
మేటి కాయాత్మ చుట్టపుమేరువగును;
అట్లు గెలువగ జాలని అకృతమతికి
ఆత్మయే ఇంటి శత్రుపై అపకరించు.

పరమాత్మభావమే, గో
చరమగు, విజితాత్మునకు, ప్రశాంతున, కర్మా
నిరసనముల, శీతోష్ణ
స్ఫురణముల, జయాజయముల, సుఖదుఃఖములన్

జ్ఞానవిజ్ఞానసంతృప్తమానసుండు,
గతవిమోహుడు, సమలోష్టకాంచనుండు
నిర్వికారుడు, నిర్జితేంద్రియుడు నెవ్వ,
డట్టి యోగి యోగారూఢు డనగనెగడు.

కలవారు, హితులు, ఘనులని,
వలపక్షములేదు; కానివా,రపకర్తల్
ఖలులని విరోధ భావము
వెలయింపరు, సములు, యోగవిదులెల్లడలన్.

నిర్జన స్థలమున నిలిచి, ఏకాకియై
అంతరంగమును సమాహితంబు
సేయువలయు, నియత చిత్తాత్ముడై యోగి,
ఆసలను పరిగ్రహమును విడిచి.

అనతినిమ్నోన్నతంబై, నిత్య పరిశుద్ధ
మై, ప్రశాంతమనోజ్ఞమైనచోట,
దర్భాసనమున మెత్తని జింకతోల్గప్పి,
దానిపై విమలవస్త్రమును పరచి,
ఆసీనుడై నాసికాగ్రము దిలకించు
తీరున చూపు కేంద్రీకరించి,
వెసలు చూడక, శిరోదేహకంధరముల
సమముగా అతినిశ్చలముగ నిలిపి,

మనసునేకాగ్రమొనరించి, అనవరోధ
నియతి, చిత్తేంద్రియక్రియానియమనమున,
ఆత్మసంశుద్ధికై యోగమభ్యసింప
వలయు యోగి, సదా, వేరు తలపులుడిగి

విను, ప్రశాంత హృదయుడును, నిర్భయుండునై,
నిండు బ్రహ్మచర్య నిష్ఠబూని,
ఉండవలయు యోగి, ఉల్లమునరికట్టి
మన్మనస్కుడై సమాధియందు

ఈవిధియోగి సదామది
నైవస మొనరించుకొని, ప్రగాఢసమాధి
శ్రీవలన బడయు, నిర్వా
ణావధియై నాయధీనమైన ప్రశాంతిన్.

తిండి అనియతమై, అసాత్త్వికమునైన,
సమధికంబైన బొత్తిగా చాలకున్న
నిదుర మితి మీరియున్న, కంటి కదితరచు
పట్టకున్నను యోగము పట్టుపడదు.

యు క్తాహార విహారుడు,
యు క్త స్వప్నావబోధయుక్తుం డెవడా
యు క్తునికే సిద్ధించు వి
యు క్త భవక్లేశమైన యోగము విజయా!

మానసమెవనికి వినియత
మై, నెలకొనియుండు, ఆత్మయందె తిరంబై,
నానాకామవినిస్పృహు
డై నయతడు యోగసిద్ధుడని పలుకబడున్.

అతులనియతి నిట్టు లాత్మయోగము నభ్య
సించుయోగియచలచి త్తమునకు
సాటియంద్రు, సవ్యసాచి! నివాతప్ర
దేశమందు వెలుగు దీపకళిక.

మనసెందు యోగసేవా
వినియతమై ఉపరమించు విచ్చుల విడిగన్;
తనలోని ఆత్మత త్త్వము
గని ముని ఎందాత్మయందె కను సంతృప్తిన్.

అతులితబుద్ధిగ్రాహ్యము,
అతీంద్రియమునైన అక్షయానందము నే
స్థితిలోన పొందు ముని ఏ
స్థితిలో బరమాత్మయందె స్థిరపడియుండున్

ఏలాభమంది సంయమి
లాలస చూపింప డితరలాభంబులపై
పాలుపడదెందు, దుఃఖాం
దోళనముల కాతడెట్టి దుస్థితినైనన్.

యోగస్థితియది, దుఃఖవి
యోగస్థితి, పడయవచ్చు నోపికతోడన్,
ధీగణ్య! అచలమగు అధి
యోగముతో, విసుగులేని యుల్లముతోడన్

తలపున మొలచిన కోరిక
మొలకల నెల్లను సమూలముగ పెరికి, మనో
బలమున నింద్రియవర్గము
నలువైపులలో నియంత్రణము సేసి, తగన్.

ధైర్యభరితమైన తనబుద్ధితో యోగి
మెల్ల మెల్ల నుపరమింపవలయు;
మనసునాత్మయందె చొనిపి, రానీయరా
దాత్మకంటె ఇతరమగు తలపు.

ప్రాయికముగ నెపు డురకలు
వేయును చంచలమనస్సు విషయంబులపై,
వేయంగనీక మెలపున
ఆయత్తము సేయవలయు ఆత్మకె దానిన్.

వరియించుగాదె స్వయముగ,
నిరఘుని: నిష్కాము, ప్రశాంతనిర్మలహృదయున్
విరజస్తము నీ యోగిని
పరమసుఖోదయము బ్రహ్మభావముతోడన్

వీరోత్తమ! ఎవడుసదా
ఈరీతిగ యోగసహితహృదయుండగు, ఆ
ధీరుండు బ్రహ్మసాక్షా
త్కారంబునుబడయు, కను నఖండసుఖంబున్.

తనలో సను స్తభూతము
లను, తన్నుసమ స్తభూత రాశులలోనన్
కను నత దెల్లెడ సమద
ర్శనుడై, అస్ఖలితయోగ సహితాత్మకుడై.

ఎల్లజీవులలోన నన్నెవడుచూచు,
ఎల్లజీవుల నాలోన నెవడుచూచు,
వానికెన్న డదృశ్యుడగానునేను,
వాడుకూడ అదృశ్యుడు కాడునాకు,

తెలిసి, ఎవడు బ్రహ్మాత్మైకక్యదృష్టితోడ
సర్వభూతస్థితుని నన్నుసంభజించు,
ఎల్లపోకలబోయి వర్తిల్లుగాక
అమహాయోగి వినుము నాయందెవెలయు.

తనసామ్యముతో నెవ్వడు
కను సకలప్రాణికోటి కష్టము సుఖమున్,
ఘనమగు సమభావంబున,
అనఘుండాయోగి శ్రేష్ఠుడనినేనందున్."

అర్జునుడు

సమతాగుణసాధ్యంబని
కమలోదర! నాకుసెప్పుకబడిన యీయో
గమునందు సుస్థిరస్థితి
సమకుఁబడదనితోచు, చిత్తచపలతవలనన్

నిలుకడవియుగునె డెందము?
బలీయుసియుగాదె? చిక్కపడుపడె? దానిన్
చులకనయె లొంగదీయుట?
అలవియెపెనుగాలి జోరు నడుపునబట్టన్.

శ్రీభగవంతుడు:

చంచలము, కర్కశమును నిస్సంశయముగ,
నీవనినరీతి మనసు దుర్నిగ్రహంబె
కాని అడగోలుగొనవచ్చు దాని నరుడు,
ప్రబల వైరాగ్యమున, చిరాభ్యాసమునను

సాధింపలేడు చిత్త
స్వాధీనములేక యోగసంపద నెవడున్,
స్వాధీనచిత్తుడొక్కడె
సాధించును, వెరవుతోడ జతనములోడన్.

అరసిచూడయోగి అధికుడు కౌంతేయ!
ఘనతపస్వికంటె, జ్ఞానికంటె,
కర్మపరునికంటె, కావున నియతితో
యోగడుగనిన యోగివగుమునీవు.

అంతరాత్మ సర్వావస్థలందు పార్థ!
మద్గతముగాగ, శ్రద్ధాసమగ్రభక్తి
నన్నుపాసించునెవ్వడు, నామతమున
యోగులందరిలో వాడె యుక్తతముడు.



# సప్తమాధ్యాయము
## విజ్ఞానయోగము

శ్రీభగవంతుడు:

సతతమదాసక్తమనో
యుతముగ నాఅండజేరి యోగస్థుడవై,
గతసంశయముగ, నన్నే
గతి సాకల్యముగ నెఱుగగలవో వినుమీ:

విజ్ఞానసహితమైన మ
హాజ్ఞానము దీనినీకు అలవడజేతున్
విజ్ఞేయము కొరవడదిక
ప్రజ్ఞానిధి! దీనిదెలియ బడసిననీకున్.

వేవురిలో అవిరళకృషి
కావించునొకండె నన్నుగనికొను తననన్:
వేవురుముముక్షువులలో
కేవలమేయొకడో అందు కృతకృత్యుడగున్.

విను, భూజలాగ్నిగగనము,
అనిలము, బుద్ధియు, మనం, బహంకృతి యనునీ
ఎనిమిదియుగలసి యేర్పడు
ననియెఱుగు మదీయమైన అపరాప్రకృతిన్,

ఇదిజడము, నికృష్టంబుం,
దదన్యము పరాప్రకృతియనంబడు, రణకో
విద! జీవభూత రెండవ
యది, చేతనమై ధరించు యావజ్జగతిన్.

ఈరెండు ప్రకృతులే జని
కారణములు సుమ్ము, భూతగణములకెల్లన్.
కారణము నేనె భారత
వీర! జగత్ప్రభవమునకు విలయంబునకున్.

వేరొకటి లేదు పరతర
మారయ నాకంటె ఈ యజాండములోనన్
దారమున మణిగణము వలె
భారత! నాయందె కూర్పబడియె సకలమున్.

చవినేను సలిలములలో
రవిచంద్రులలోని కాంతిరాశియు నేనే
దివిలో శబ్దము, భరత
ప్రవీర! నిగమములలోన ప్రణవము నేనే

ధరలోని పుణ్యగంధము
పురుషులలో పౌరుషము, తపోధనుల తపః
స్ఫురణము నేనె ధనంజయ!
పరమాయువు నేనె ఎల్లప్రాణులలోనన్

తేజస్వుల తేజంబును
పూజిత సద్బుద్ధియుతుల బుద్ధియునగుదున్
బీజమును నేనె భూతస
మాజమునకు, వీరకురుసమాజవరేణ్యా!

తలపుము నన్నర్జున! దో
ర్బలవంతుల కామరాగపరివర్జితదో
ర్బలమని, సుజనుల అవిశృం
ఖలమగు ధర్మావిరుద్ధకామం బనియున్

సాత్త్వికములన, మరియు రాజసము లనగ,
తామసములన, భావము లేమికలవొ
కలుగునవియెల్ల నానుండి, కాని నేను
వానిలో లేను, అవియు నాలోన లేవు.

త్రిగుణమయములు కాన, ఈ మూడుగుణముల దైన
ఈ వికారంబులకు జిక్కి ఎల్లజగము
భ్రాంతినొంది ఎఱుంగదు, వానికంటె
పరమయిన నిర్వికారు, అక్షరుని నన్ను.

తరియించుట కష్టము, గురు
తర, మీ గుణమయము, నాదు దైవీమాయన్,
తరియింపగలరు నన్నే
శరణముగ సమాశ్రయించు జనములు దానిన్

చేపట్టినను భజింపరు,
కాపురుషులు, దుర్వివేకకలితులు, మాయా
ప్రాపితవిమోహులు, అలసులు,
పాపవ్యాపారు, లసురభావాశ్రితులై

విను, మార్తుడు, జిజ్ఞాసువు,
ధనార్థి, జ్ఞానియు ననంగ తత్పరమతులై
ననునమ్మి యుపాసింతురు
పనిపడి నలుతెఱగులయిన భక్తులు, పుణ్యుల్

ఈ నలువురు భక్తులలో
జ్ఞాని సదాయుక్తుడగుట శ్లాఘ్యుడు; నాకున్
జ్ఞానికడుగూర్చు, డూర్తును
వానికి నేనును తదేకభక్తివశుడనై

అరయ నలుపు రుదారులే యైననందు,
జ్ఞానియన నామతమున సాక్షాత్తునేనె
అతడు నన్నె అనుత్తమానల్పగతిగ
ఎంచి యుక్తాత్ముడై యాశ్రయించుగాన.

పెక్కుజన్మము లెత్తినపిదపగాని
జ్ఞానియై, వాసుదేవుడే సర్వమనెడి
సమ్యగనుభూతిగనినన్ను శరణుసొరడు
నరుడు; వినుమట్టి మహాత్ముడరుదుగాదె

కోరికలచే వివేకము గోలుపోయి,
పూర్వజన్మసంస్కారము ప్రోద్బలమున
పర్యుపాసింతు రన్యదేవతల దగిలి
మనుజు లాయానిబంధన లనుసరించి

సాయక శ్రద్ధాయుతుడై
ఏయేదేవతల గొలుచు, నేయేభక్తుం
డాయాభక్తుల కొసగెద
ఆయాదేవతల మీద నచలశ్రద్ధన్

వాడును మదర్పితశ్రద్ధతోడ, ఇష్ట
దైవతవ్యాజమున నన్నెతవిలికొలుచు
నేనుగరుణింతువానికి వాని ఇష్ట
దైవతము చేతినుండియే తదభిమతము

కాని, నశ్వరంబు కౌంతేయ! అట్టులా
అల్పబుద్ధికనిన ఆఫలంబు
దేవతార్చకుండు దేవతలనుజేరు
ననుభజించువాడు నన్నెజేరు

కురువీర! యోగమాయా
వరణపరీవృతుడనగుట ప్రాకృతుల కగో
చరుడనగుదు, ననుగప్పిన
తెర దుర్భేద్యంబనుమ్మ త్రిగుణాత్మకమై.

ఎఱుగుదునే బరిపాటిగ
పురాతనాద్యతనభావిభూతములను, త
చ్చరితములను భరతోత్తమ!
ఎఱుగడు ననుమాత్రమించుకేని ఒకండున్.

విను, ఇచ్ఛాద్వేషవశం
బున బొడమిన ద్వంద్వముల విమోహితులై, పు
ట్టిననాడె పొందుచుందురు
జనులెల్లరు ప్రాయికముగ సమ్మోహంబున్

ఫలము పరబ్రహ్మార్పణ
కలనముతో పుణ్యకర్మకరణమున విని
ర్గళితాఘులైన నియతా
త్ములుకొందురుపార్థ: ద్వంద్వమోహవిముక్తిన్.

భవజరామృత్యుముక్తికై ఎవరునన్ను
ఆశ్రయించిప్రయత్నింతు, రట్టివారు
యావదధ్యాత్మతత్త్వము అఖిలకర్మ
కాండమును బ్రహ్మమేయని కాంతురెరిగి,

సాధిభూతుని, సాధిదైవాధియజ్ఞు
నను నిజంబుగ తెలియగల్గిన కృతాత్ము
లనువిమోక్షణవేళయందైన నియత
దృఢమనోబుద్ధులై నన్ను తెలియగలరు.

# అష్టమాధ్యాయము

# అక్షరబ్రహ్మయోగము

అర్జునుడు:

ఆపరంబ్రహ్మమెట్టిది? ఆశ్రితార్తి
హరణ! అధ్యాత్మమన, కర్మమనగనేమి?
దేని నధిభూతమందురు? దేనికి అధి
దైవమని పేరు? భువనసంభావనీయ!

మరియ, అధియజ్ఞుడెవ్వడు!
పురుషోత్తమ! మరణసమయమున నిన్నెదలో
స్మరియించు వినియతాంతః
కరణుల కటమెద ఎట్టిగతి సమకూరున్.

శ్రీ భగవంతుడు:

అక్షరము బ్రహ్మ మద్వయ మనతిశయము,
ప్రతిశరీరములోపల ప్రత్యగాత్మ
భావమంది, నిజాంశరూపమున నిలుచు
తత్స్వభావము నెగడు అధ్యాత్మమనగ.

జీవుల సముద్భవమునకు, స్థితికి మూల
మైన యజ్ఞాహుతిని కర్మమనవచింత్రు
పార్థ! అధిభూతమని పిల్వబడు, వినాశ
వంతమగు ఈ శరీరాదివస్తువితతి.

వినుతిగనియె హిరణ్యగర్భునిగ నెవ్వ
డా విరాట్పూరుషుడె అధిదైవతంబు,
అధివసింతు అంతర్యామినగుచు నేనె
ప్రాణుల శరీరమున అధియజ్ఞుడనగ.

మరణదశయందు నైతము
మరువక మదిలోన నన్నె స్మరియించుచు మేన్
దొరగునెవం, డాతడునా
స్వరూపమును బొందు; ఇది అసంశయ మనఘా

ఏయేభావంబును తల
పోయుచు కడసారి మానవుడు కనుమూయున్,
పాయక తలంచుచుండిన
ఆయా భావమునె పొందు అతడామీదన్.

కనుక, నిరంతరమును న
న్ననుస్మరింపుము, స్వధర్మమనిపోరుము, నీ
మనసును, బుద్ధియు నాపై
జొనిపితివా, మత్పదంబు జొత్తువు పలకన్

అనితరవిషయగమౌ
మనము, చిరాభ్యాసయోగసహితమునగు నె
మ్మనమున నను చింతింపుము
జనములు కనగలరు దివ్య, శాశ్వతపురుషున్.

భక్తిసంయుక్తుడై, ప్రాణోత్క్రమణవేళ,
పరిణతదృఢయోగబలము కలిమి
బొమదోయినడుమ ప్రాణమును నెన్నగ నాన్పి
అవ్యక్తు నఖిలలోకాతిరిక్తు
సర్వజ్ఞు, సర్వశాసకుని, సనాతను
అణువుకంటె అణీయుడైనవాని
మాయాంధకారదవీయుని రవివర్ణు
భావనాతీతదివ్యస్వరూపు

ఆగమాంతవేద్యు నఖిలప్రభవభూమి
నచలమానసమున ననుజపించు
అలఘుపుణ్యశాలి ఆద్యంతవిరహిత
మైన బ్రహ్మమందు నైక్యమందు

ప్రవచింతుర్ నిగమజ్ఞు లక్షరము, పూర్ణంబంచు నెద్దాని, స
ద్వ్యవసాయుల్ ఏనివృత్తకాములకు గమ్యంబెద్ది, ఎద్దానికై
అవలంబింతురు ముక్తికాముకులు భవ్యబ్రహ్మచర్యంబు, వా
సవి! ఆస్థానము నీకు తేటపరుతున్ సంక్షేపరూపంబునన్

సర్వేంద్రియములను చక్కగ నియమింప
మును తదీయద్వారములను మూసి,
దృశ్యజాలమునుండి తిరిగిచి దృక్కున నిల్ప
మనసును హృదయపద్మమున జొనిపి,
మస్తకంబున సుషుమ్నానాడివెంబడి
ప్రాణంబు బ్రహ్మరంధ్రమున నునిచి,
పరిపూర్ణజీవాత్మపరమాత్మసంయోగ
మను యోగధారణ నాశ్రయించి,

అవల ఓమను పావనైకాక్షరమును
ఉచ్చరించుచు దానివాచ్యుడనునన్ను
ఎడతెగక సంస్మరించుచు ఒడలు విడిచి,
పయనమగు నెవ్వ, డతడేగు పరమగతికి

అనుదినము నన్ను నెవ్వం
డనన్యచిత్తమున దలచు ననవరతంబున్
వినుము ధనంజయ: సులభుం
డను నేనానిత్యయుక్తునకు భక్తునకున్

ఘనదుఃఖకరము జన్మం
బనిత్యమనితెలిసి, ఇట్టు లచలితభక్తిన్
నను బొందిన బొందు, పున
ర్జననీజనజఠరపితరశయనవిముక్తిన్

పునరావర్తకములె ఫ
ల్గున! లోకములెల్ల బ్రహ్మలోకము వరకున్
కననేర్తురు ననుగలసిన
జనమెసుమీ, జననమరణచక్రవిముక్తిన్

యుగములు నాలుగువేలౌక
పగలు విధాతృనకు, అంతపరిమితికలదే
యగునతనిరేయి, తెలిపిరి
యుగదీర్ఘ భుజాఢ్య! ఇటులహోరాత్రవిదుల్

వ్యక్తచరాచరగణ, మ
వ్యక్తంబునబుట్టు దత్ప్రభాతంబున అ
వ్యక్తములో లీనంబగు
వ్యక్తమశేషముగ, రాత్రియగుటయు విజయా!

ఆచరాచరములె అర్జున! చర్వితచ
చర్వణముగ పెక్కుజన్మలెత్తి
సమయురాత్రిపూట, తమకర్మవశమున
మగుడపుట్టుచుండు పగటిపూట

అమరేంద్రాత్మజ! పైనబేర్కొనిన అవ్యక్తంబుకంటెన్, వరే
ణ్యము, వేఱొక్క సనాతనంబయిన అవ్యక్తంబె బ్రహ్మంబు; లో
కములున్ లోకపతుల్ నశించినమహాకల్పాంతమందైన అం
తములేకుండ వెలుంగుచుండునది నిత్యంబై, నిరాలంబమై

విను మక్షర మవ్యక్తం
బనునదియే టదియె పరమమగుగతి; అటపం
జనువానికిలేదు నివ
ర్తన, మదినాపరమైనధామము పార్థా!

ఎల్లజీవులు నెలకొను నెవనిలోన
ఎవనిచే వ్యాప్తమయ్యె నీభువనమెల్ల
భక్తితాత్పర్యరాగి, నాపరమపురుషు
దెలియు, ననితరభక్త్యైకసులభుడగుట

ఎత్తెరువువట్టిచని, భర
తోత్తమ! మరణించినట్టి యోగిజన, మనా
వృత్తిని, ఆవృత్తిని గను
అత్తెరువులు నీకు వినుతు నాలింపుమొగిన్.

జ్యోతియును అగ్నియును, పగల్, శుక్లపక్ష,
మవల షణ్మాసమగు ఉత్తరాయణమును,
ప్రాపకులుదేని, తాత్రోవబట్టియేగి
బ్రహ్మమునుజేరుదురు జనుల్ బ్రహ్మవిదులు

క్రీడి! ధూమము, రాత్రియు, కృష్ణపక్ష
మవల షణ్మాసమగు దక్షిణాయనమును
ప్రాపకులుదేని తాత్రోవబట్టి యోగి
చంద్రజగతికిజని, పునర్జన్మమొందు

విను, మర్చిరాదిమార్గం
బనగాదగు శుక్లమార్గ మరికట్టు బున
ర్జననము,ధూమాదిపథం
బనుకృష్ణపథంబు దాని నాపాదించున్

ఈయిరుతెరువులు నెఱిగిన
యే యోగియు మోహమందదెన్నండైనన్,
ధీయుతుడవు కావున నీ
వోయనఘ! అజస్రయోగయుక్తుడవగుమీ

దీని జక్కఁగ నెఱిగి అతిక్రమించు,
వేదముల, యాగముల, తపోవితరణముల
పడయు పుణ్యఫలంబు సర్వమును యోగి
పరమమైన అనామయపదమునొందు

---

# నవమాధ్యాయము

## రాజవిద్యా రాజగుహ్యయోగము

శ్రీ భగవంతుడు :

విజ్ఞానసహితమైన మ
హజ్ఞానము, దీని నీకు అలవరతు, గతా
వజ్ఞుడవుగాన, విను మా
విజ్ఞత అశుభంబునుండి విడిపించునినున్

రాజవిద్యయనగ, రాజగుహ్యంబన,
ఒప్పునిది పవిత్ర, ముత్తమంబు,
అభ్యసింప సులభమైనది, సాక్షాత్సు
ఖావగమము, ధర్మ్య, మవ్యయంబు

విను, మీశ్రేయోధర్మం
బున శ్రద్ధారహితులైన భూరివిమోహుల్
ననుగానలేరు, పడుదురు
జననజరామరణరూపసంసారమునన్

చక్షురాదుల కగోచరమైన మూర్తితో
యవజ్జగంబునే నావరింతు,
నిఖిలభూతగణంబు నెలకొను నా యందు,
కాని నేనుండను వానిలోన;
అరయ భూతములు నాయందుండునవికావు,
కనుము నాదైవయోగము కిరీటి!
పుట్టించు, భరియించు భూతసంతతిగాని,
వానిలోనెపుడు నిల్వదు మదాత్మ:

ఎల్లెడల సంచరించుచు నెల్లనిలుచు
ఆకసములోన దానిచే నంటబడక,
నిత్యము మహా సమీరము, నిలిచియుండు
అట్లు నాలోన సకలచరాచరములు.

ప్రళయవేళలందు పార్థ! నా ప్రకృతిలో
భూతగణ మశేషముగ లయించు,
క్రమ్మరంగవాని గల్పింతు నాదుసం
కల్పశక్తి గల్పకల్పమందు

పాండవేయ! నాదుప్రకృతిని గైవస
పఱచుకొని, సృజింతు పరల మరల
ప్రకృతివశము నొంది, పరతంత్రమైన యీ
సకలభువనభూతసంచయమును.

కాని, నిబంధింపవు న
న్నానతరిపువీర! ఆమహాకర్మంబుల్
వానియెడ నేను తగులని
వానిగ, ఆ జోలిలేనివానిగ నుందున్

నాయధ్యక్షత క్రిందనె
ఈ యెల్ల చరాచరముల నీను ప్రకృతి, కౌం
తేయ! ఆదికారణముగనె
పాయక యీవజ్జగంబు పరివర్తించున్

సరకుగొనరు నన్ను జడులు లోకముతోడి
మనుజమాత్రునిగనె మదిదలంచి,
ఎల్ల భూతములకు ఏలికననుచు నా
పరమతత్త్వమెఱుక పడనికతన

కారణజన్మునిగా న
న్నారసి దరిజేరలేని వ్యర్థజ్ఞానుల్
వా రలసులు, వ్యర్థాశా
ప్రారంభులు, రాక్షసాసుర ప్రకృతివశుల్

దైవీసంపదతోడి మ
హావిదులు, మహాత్ము లజుడ, నవ్యయుడ మహా
దేవుడనను ప్రత్యయమున
సేవింతురు నన్ననన్యచిత్తముతోడన్

సతతమునను గొనియాడుచు,
యతచిత్తులు, నిత్యయుక్తులై, నాకు సదా
కృతవందనులై యచల
వ్రతులై వారర్థి బర్యుపాసింత్రు ననున్

అనఘ! అద్వైతభావనయైన జ్ఞాన
యజ్ఞమునగొంద ఱు భజింప, అట్లుగాక
ద్వైతభావనతోడ గొందఱు భజింత్రు;
విశ్వతోముఖు ననుగొల్చు వివిధగతుల
వారివారి సంస్కారముబట్టి జనము

క్రతువనగ యజ్ఞమనగా
హుతమనగా ఆజ్యమనగ, ఓషధియనగా
హుతవహుడన మంత్రబన
అతులమతీ! విశ్వమూర్తి నగునేనెసుమీ!

పితయును, మాతయు, ధాతయు
పితామహుడునేనె సకలవిశ్వమునకు; ఓం
కృతియు, పవిత్రము, వేద్యము,
శ్రుతిత్రయము నేనెయని ఎఱుంగుము విజయా!

గతియును, శరణము సాక్షియు
పతియు, నివాసమును, గురువు ప్రభవప్రళయ
స్థితులును, అవ్యయబీజము
హితుడును, పెన్నిధియునేనె ఈ జగమునకున్

నేనె కలిగింతు వేడిమి
వానలు కురియింతు వానివారింతును ధీ
మానుజ! సదసత్తులు విను
మేనే, అమృతంబునేనె, మృత్యువునేనే

త్రైవిద్యుల్ నను యజ్ఞయాగముల నారాధించి, తత్సోమసం
సేవంబావనులై, విముక్తి తెరువుం జింతింప: రత్యంతకా
మావేశంబున, స్వర్గలోకసుఖలీలాభోగమర్థించి దే
వావాసంబునకేగి చొక్కుదురు దివ్యానేకభోగంబులన్

అట్లుభోగించి, పూర్వపుణ్యము క్షయింప
మర్త్యలోకము జొత్తురు మరలవారు;
కాంతురిట్లు త్రయీకామ్యకర్మకరులు
భోగనిరతులు తెగనిగతాగతములు

మనసార సంస్మరింపుచు,
అనన్యులై యాశ్రయింతురర్జున! నన్నే
జను, లాసదాభియుక్తుల
ఘనయోగక్షేమమునకు గావలిసగుదున్

ఇతరదేవతల దదేకమనస్కులై,
కొలుతురెవరు శ్రద్ధకొనయుసాగ,
అవిధిపూర్వకముగ, అఖిలరూపుని నన్నె
కొలుతురట్టివారుకూడ పార్థ

10)

విను, ఫలభోక్తయు, ప్రభువును
అనఘాత్మక! నేనె సకలయజ్ఞంబులకున్
ననునిట్లు యథార్థంబుగ
గననేరనియజ్ఞకర్త కను జతనంబున్

ఫలమో, పుష్పమొ, పత్రమొ
జలమో నాకర్పణముగ సద్భక్తి విని
ర్మలహృదయు డెవ్వడిచ్చిన
ఎలమింగయికొని అనుగ్రహింతును వానిన్

ఏమిచేయుదు, వేమిచేయింపదలతు
వేమి భుజియింతు, వేదానమిత్తు వేమి
వేల్తు వేతపముందువు: విమలభక్తి
ఆచరింపువాని నాకర్పితముగ

మేలుగీడును గలిగించు మేటికర్మ
బంధనమునుండి ఇటు విడివడుదువీవు,
సతతసన్న్యాసయోగనిష్ఠితమనంబు
గలిగి ముక్తుడవై నన్ను గలియగలవు

చెలిమి పగయు నాకు గలుగచెవ్వని యందు
సకల భూతములకు సముడనేను,
భక్తినను భజించువాడు నాయందుండు
ఉందు నేనువానియందు పార్థ!

అవగుణాచారుడగుగాక, ఎవడునన్నె
అచలమతి ననన్యాశ్రయుడై భజించు
పరిగణింపుము వాని సత్పురుషుడనియె
మంచిపనిచేయుటకు నుత్సహించెగాన

అతడచిరకాలముననె ధర్మాత్ముడగును,
సవినయుండగు, పడయు శశ్వచ్ఛాంతి
విను "నశింపడు నాభక్తు"డనఘచరిత!
పలుకు మీమాట యొరులకు బాసచేసి

పతితులు, పాపజన్ములును పాపులు నన్నుసమాశ్రయించి స
ద్గతిగనజాలిరన్న, జితకాములు మామకభక్తకోటిసం
గతిమరి చెప్పనేల? అసుఖప్రద, మస్థిర, మీ భువిన్ జనిం
చితివి, ననున్ భజించి, భవసింధువు నుత్తరియింపు మర్జునా!

మన్మనస్కుడవును, మద్భక్తుడవు కమ్ము
నాకు సంఘటింపు నతులు నుతులు
మత్పరాయణుడవు మన్నిషితాత్ముడ
వగుము మత్స్వరూపి వగుదువిట్లు



# దశమాధ్యాయము

## విభూతి యోగము

శ్రీ భగవంతుడు:

మరల నొకమాటు చెప్పగ
అరిసూదన! వినుము పరమమగు నా మాటన్,
భరితాసక్తుడవగునీ
పరమహితముగోరి తేటపడగ వచింతున్.

సురలెఱుగరు నా మూలము,
ఎఱుగరు ఋషిగణముకూడ, ఎందులకన్నన్
సురలకు, మహర్షిగణమున
కరయగ మూలమును నేనె అఖిలవిధములన్.

స్థావరజంగమమయభూ
తావిర్భావస్థితిక్రియాప్రత్యవహా
రావృత్తులు నాలీలలు
భావాతీతంబు మదనుభావము పార్థా

ననులోకమహేశ్వరుడని
అనాదియని ఎవ్వడెఱుగు ఆత్మజ్ఞుండై
ఘనుడతడు విమోహావిలం
ఘనుడై ప్రాపించు సకలకలుషవిముక్తిన్

తెలివియు, బుద్ధియున్, శమము, తిన్నదనంబు,దమంబుసత్యమున్
కలత భయాభయంబులును, కష్టసుఖంబులు, చావుపుట్టుకల్
చెలిమియు,విగ్రహంబు, సమచిత్తత, తాల్మియు నాదిగాగ, నా
వలననె చొప్పుడున్ వివిధభావపరంపర ప్రాణికోటికిన్

అనఘులు సప్తమహర్షులు,
మనువులు మద్భావులయిన మానసజాతుల్
వినువారి సంతతియె, యీ
జనసంతతియెల్ల భరతసంతతివర్యా!

ఏనఖిలమునకు ప్రభవ
స్థానము, నఖిలంబు నాకతనవర్తించున్
జ్ఞానులిదియెఱిగి అనుకం
పానిరతు భజింత్రు నన్ను భావాన్వితులై

అర్థి నన్యోన్యబోధకులగుచు వారు
కడపుదురు ప్రొద్దు మత్ప్రసంగములతోడ:
మద్గతప్రాణులై సదా మన్మనస్కు-
లై రమింతురు,ముదితులై అవిరతముగ

పరమప్రియమున నాయెడ
మరగినమదితో భజించు మద్భక్తులకున్
కరుణింతు జ్ఞానయోగము
దరియగలరు వారునన్ను తత్సాహ్యమునన్

కేవలము వారివలనికృపావశమున
ఏను తద్భావముల నాశ్రయించియుండి
సమయజేతుదదజ్ఞానజనితతమము
జ్ఞానదీపప్రకాశప్రసారణమున

అర్జునుడు:

పరమాత్మ! పరబ్రహ్మవు
పరమపవిత్రుడవు, పరమపదమవు సదస
త్పరుడ, వభవుడవు దివిష
త్పరిషదుపాస్యుడవు, భక్తపరతంత్రుడవున్

దేవర్షి నారదుండును,
దేవలు, డసితుండు వ్యాసదేవుడు నాకున్
నీ విభవ ముగ్గడించిరి
నీవలననువింటినేడు నిండినెమ్మిన్

నీవిప్పుడానతిచ్చిన
యావద్విషయంబు సత్య మచ్యుత! త్రిజగ
త్పావన! నీవ్య క్తిత్వము
దేవతలకు అసురులకు అతీతము తెలియన్

పామెఱుగు పాముకాళులు
నీమహిమాభోగమీవె నేర్తువు తెలియన్
శ్రీమన్ముకుంద! కేశవ!
స్వామీ! భూతేశ! భూతభావన! శౌరీ!

నీవేమివిభూతులతో
యావద్విశ్వాంతరమున వ్యాపించితి; వా
భావాతీతమహాద్భుత
భావత్క విభూతు లెఱుగ బలుకుము నాకున్

ఏనెవ్విధమున నిత్యము
ధ్యానించిన, నీవు తెలియనగుదువు నాకున్,
ధ్యానమున కనుగుణంబుగ
ఏనేయే భావముల గ్రహింతు మహాత్మా!

నీవిభూతిగరిమ నీయోగశక్తియు
వినగవలతు మరల విస్తరముగ
ఎంతగ్రోలికొనిన సంతృప్తి తీరదు
నీవచోమృతంబు దేవదేవ!

శ్రీ భ గ వ ం తు డు :

పంచెద కురుప్రవీర! ఇమ్మరి వచింతు
ఆలకింపుము; దివ్యము, లతులితములు
నావిభూతులలో ప్రధానములు కొన్ని
మేరలేదు తదీయవిస్తారమునకు

ఏను ప్రత్యగాత్మ నెల్ల భూతములందు
నిలుతువాని హృదయముల గిరీటి!
ఇదియెకాదు వానికెల్ల గుడాకేశ!
మొదలు, నడుమునేనె తుదియునేనె

ఆదిత్యులలో విష్ణుడ
నౌదు, మరియు శంకరుడ మహారుద్రులలో
నాదములలోన ప్రణవము
వేదంబులలోన సామవేదము నగుదున్

శీతాంశుడ చుక్కలలో
జ్యోతిస్సులలోన రశ్మియుతుడైన రవిన్
చేతము నింద్రియములలో
చైతన్యము నేనె జంతుసామన్త్యమునన్

దేవతలలో మహేంద్రుడ
పావిత్ర్యావహములలోన పవమానుండన్
పావకుడ నష్టవసువుల
స్థావరములలోన నత్యుదగ్రహిమాద్రిన్

మేరువు నద్రికులంబున
ఐరావతమను మతంగజానీకమునన్
భూరినదులందు గంగను,
పారావారమను నీటిపట్టులలోనన్

వరుణుడ జలదేవతలను
విరజస్తములైన యోగవిదుల భృగుండన్
గురువులలో సురగురుడను
మరీచియను వాడ సప్తమారుతములలోన్

సేనానులలో గుహుడను
ధేనుగణములోన కామధేనువు నగుదున్
ధానుష్కులలో రాముడ
జానుగ యజ్ఞములలోన జపయజ్ఞంబన్

శాసకులలోన యముడను
వాసుకిని విషోగ్రభుజగవర్గములోనన్
కేసరిని మృగకులంబున
మాసంబులలోన వినుము మార్గశిరంబన్

యక్షాదులలో శ్రీదుడ
రక్షోవంశీయులందు ప్రహ్లాదుండన్
వృక్షములలోన రావిని
పక్షులలో వేగవత్సుపర్ణుడ నగుదున్

పవిని మహాయుధములలో
అవిషములగు నాగులం దనంతుడ, నుచ్చై
శ్రవమను సైంధవములలో
దివిజర్షులలోన కృతమతీ! నారదుడన్

నారీవిభూషణములగు
సైరణయును ధృతియు, స్మృతియు సౌశీల్యంబున్
ధారణశక్తియు ప్రేమయు
హ్రీరమ్యత్వమును, శ్రీసమృద్ధియు నేనే

అఖిల విద్యలందు అధ్యాత్మవిద్యను
అర్యముడను పితరులందు నేను,
బ్రహ్మవేత్తలందు బాదరాయణుడను,
ప్రజనుతయిన భావభవుడ నేను.

కపివరుల మరుత్తనయుడ
కపికేతన! వినుము మనుజగణములలోనన్
నృపతిని, ఘనసిద్ధులలో
కపిలుండను, చిత్రరథుడ గంధర్వులలోన్,

మానుగ ఋతుచక్రంబున
నేనువసంతమను, గోపనీయంబులలో
మౌనమనునేను, విమల
జ్ఞానంబునునేను జ్ఞానసంపన్నులలోన్.

జయమును, వ్యవసాయంబును
జయిష్ణువుల విమలనీతిసంపదయు, ధనం
జయ! నేనె, మరియు నాది
క్షయములు మధ్యమునునేనె సర్గంబులకున్.

అఖిలఛందస్సులందు గాయత్రినగుదు
ప్రాడ్వివాకుల ధర్మవిప్లవము మాన్పు
దండమును వాదరతుల వాదమునునేను
సాత్త్వికుల సత్త్వగుణమను సవ్యసాచి!

కరణములలోన అంతః
కరణంబను, కవులలోన కావ్యత, పద్మా
కరముల మానసమును, అ
క్షరమాలికలోన నే అకారమునగుదున్

వాసుదేవుడ యాదవాన్వయులలోన
పాండునృపసంభవులలోన ఫల్గుణుడను
ఘనబృహత్సామమను సామగానమందు
ప్రథితవర్షములందు భారతము నేను

లేవు ప్రతికారములుదేని లీల, కట్టి
అఖిలజంతుసంహారిణియైన క్రూర
మృత్యువును నేను, ఎవ్వరికేని గడవ
రాని అక్షయకాలమునేను పార్థ!

ఈ జీవకోటికెల్లను
బీజంబగునెద్ది, అదియు వినుమేనె యశో
రాజిత! చరాచరంబుల
ఏజీవము నుండజాల దేనుండనిచో

నిరవధికంబులు కావున
కురుశేఖర! వానిలోన గొన్నింటిని నీ
కెరిగించితి, నా దివ్య
స్వరూప విస్తారములను సంక్షేపముగన్

సకలస్థావరజంగమాత్మకసువిస్తారప్రపంచంబులో
అకలంకంబు, విభూతిబంధురమునై అత్యూర్జితోదాత్తరే
ఖకు దావై ఒకవస్తు వెప్పుడెచటన్ గన్పట్టినన్ దాని మా
మకతేజోంశసముద్భవంబనియె సంభావింపు భవ్యాత్మకా

ఈలీల విస్తరింపగ
నేలా? ఒకమాటలోన ఇపుడెరిగింతున్
నాలోనొక అంశముననె
త్రైలోక్యమునిండి, నేను దాని ధరింతున్

# విశ్వరూపసందర్శనయోగము

అర్జునుడు :

పరమము గుహ్యము శ్రేయ
స్కర, మీ అధ్యాత్మవిద్య, చక్కగనాకున్
కలిపితి, వనుగ్రహంబున,
మురభంజన! విగతమయ్యె మోహమునాకున్

సీవలనవింటి, భూత
ప్రావిర్భావాత్యయములు పర్యాప్తముగన్
వైవిధ్యముకల నీయను
భావంబును నాకు తేటపడియె ముకుందా!

కను, మాదిత్యుల, వసువుల,
పసుపుల, రుద్రులను, ఋషుల, మారుతపుల, అ
శ్వినులను, మున్నెన్నడు నీ
కనుగొనని విచిత్రములను కన్గొనుడీ నాలోన్.

కనబడు కేంద్రీకృతమై,
కనుచెదర, చరాచరాత్మకము త్రిభువన మీ
తనువున, పరిశీలింపుము
ధనజయా! మరియు పెక్కు ద్రష్టవ్యములన్.

కనజాలవు ప్రాకృతమగు
కనుగవతో దీనిగాన,కరుణించెద నీ
కనఘ! అలౌలికచక్షు
ర్జననము, మదీయయోగచాతుర్యమునన్

సంజయుడు:

అని దివ్యదృష్టియిడి, అ
ర్జునునకు యోగీశ్వరేశ్వరుడు హరి చూపెన్
జనవర! ఐశ్వరమగుతన
మునిజనహృద్ధ్యేయమును సముజ్జ్వలమూర్తిన్.

అకవ్వాటి దర్శించె, అ
నేకాద్భుతదర్శనము, అనేకముఖాక్షి
వ్యాకీర్ణమును, గదాధరు
భీకరరూపమును, సర్వవిస్మయమయమున్.

దివ్యానేకాభరణము,
దివ్యానేకోద్యతప్రదీప్తాయుధమున్,
దివ్యవిలేపనగంధ
ద్రవ్యంబును. దివ్యదామధౌరేయమునై

గగనసీమ పట్టపగలింటిసూర్యులు
వేవురొక్కసారి వెలిగిరేని
ఎంతవెలుగుపుట్టు, అంతటివెలుగుతో
అతిశయించె, ఆయనంతమూర్తి.

బహువిధములఁ బున్న ప్రవిభక్తమైయుండు
భువనమెల్ల, ఆదిపురుషుడైన
ఆమురారివిగ్రహమున నేకస్థమై
గోచరించె సవ్యసాచికపుడు.

వెఱపును, వెఱగును మదిలో
పెరిగొన, మైపులకరింప, వెంగ్రుకనిక్కన్
శిరసాకృతవందనుడై
నరుడిట్లనె విశ్వరూపునకు సాంజలియై.

అర్జునుడు:

"దేవ! నీదుదివ్యదేహములోగంటి
పంకజాసనస్థు బ్రహ్మదేవు,
సకలదేవతలను, సకలచరాచర
భూతములను, దివ్యభుజగములును.

సర్వతోబహుభుజవక్త్రచక్షురుదర
మహితమగు నీయనంతవిగ్రహములోన
తుదయు, నడుమును, మొదలును తోపవెపట,
విశ్వకారణ! విశ్వేశ! విశ్వరూప!

భూరిముకుటగదాచక్రధారివైన
నిరతిశయరూపు నినుగంటి, దురవలోక
సర్వతోదీప్తమానప్రచండతేజు,
అప్రమేయుని, దీప్తానలార్కనిభుని.

పరమజ్ఞేయుడ, వీవ
క్షరుడవు, జగములకు నిత్యసంశ్రయుడవు, సు
స్థిరధర్మగోప్త, వజుడవు,
పురాణపురుషుడవు, పరమపురుషుడ వీశా!

అతిమాత్రాద్భుతదివ్యదర్శనుడవీ వాద్యంతశూన్యుడ వు
ద్యతబాహుండ, వనంతవీర్యుడవు చంద్రాదిత్యనేత్రుండ, వ
చ్యుత! నీనోళుల నిప్పుకల్ దొరలగాచూపట్టె తౌరా జగ
త్త్రితయంబుందపియింప బూనినక్రియన్ దేజో మహిష్ఠుండవై

జగములు భయసంక్షుభితము
లగుచున్నవి నీభయంకరాకృతిగని భూ
గగనదిగంతరమంతయు
అగుపించె భవన్మయముగ అఖిలాండపతీ

బహుదంష్ట్రాభీషణమై
బహువదనభుజాక్షిపాణి పాదంబగు నీ
మహదాకృతిగని లోకులు
బహువ్యథితులైరి, నేను భయపడుచుంటిన్

ఆకసమునంటి నలుగడ లావరించి
నిడుదకన్నులు తీండ్రింప వెడదనోళ్ళు
తెఱచికొనియున్ననినుగని దేవ! నాకు
ధృతి పటాపంచలయ్యె శాంతియునడంగె

అలఘుదంష్ట్రాకరాళములైన నీదు
వక్త్రముల కాలవహ్నికల్పముల గనియె
దిక్కుతోచక, దిగులొంది చిక్కువడితి
నన్ను కరుణింపు దేవ! జగన్నివాస!

గురుభీష్ములు కర్ణాదులు
కురుతనయులు, వారిమిత్రకూటమియును, మా
తరపున నున్న వజీరులు
త్వరపడి తమ బాసపైన దళములతోడన్

చొచ్చుచున్నారు తరమిడివచ్చియదిగో
వాలుకోఱల తోడి నీనోళులందు
తఱచు నీ పండ్లసందున తలలుకొన్ని
చిక్కుకొని బిట్టుతుమురయ్యె చిటికలోన

బలుకడలిలో నదీబహు
సలిలౌఘములెట్లు చొచ్చిసంలీనమగున్
వెలుచన వెగిరట్లు సము
జ్జ్వలించునీ నోళ్ళలోనబడి యీవీరుల్

దరికొన్నచిచ్చులోనికి
త్వరితగతిన్‌దూకు మిడుతదండుపగిది, నీ
తెఱనోళ్ళప్రవేశింతురు
నరులెల్లను, వేగపడి వినాశమునొందన్.

నాలుకలుచాచి, భయదో
త్కీలములగు నోళ్ళలోనికిన్ జంతువులన్
వేలాగి చప్పరింతువు
కేళియెనీకిట్టి ఘోరకృత్యంబు ప్రభూ।

నీవెవ్వ రేమిపనికై
ఈవిధి నుగ్రాకృతిన్ వహించితివకటా।
దేవేశ్వర। నినుదెలియం
గావేడెద, కేలుమోడ్తు, కరుణింపుననున్,

శ్రీభగవంతుడు:

కాలుడను నేను, లోకసంక్షయకరుండ,
ఆయితుడనైతి లోకసంహారమునకు
నీవు వధియింపకున్నను, నీవిరోధి
వీరలందఱు లేకుండువారె ఇంక

కనుకలెమ్ము, విరోధివర్గమును గెలిచి.
అమలయశమును, ప్రాజ్యరాజ్యమును గొమ్ము;
పడిరినాచేతనే మున్నె పగతురెల్ల
అర్జునా! నిమిత్తమాత్రుడవగుము నీవు.

విగతవీర్యులజేసి, నీపగఱనెల్ల
నేడు కడప్రాణమున నిల్పినాడ నేను
వీరి నలవోక చంపుము, వెఱువవలదు
కలన గెలుతువు నే బూటకాపు నీకు"

అనినముకుందుని పలుకులు
విని, గడగడవడకి, మ్రొక్కి, విన్వచ్చుడు క
ష్టనితో తొట్రుపడుచు ని
ట్లనియెమరల, భీతభీతుడై, ప్రాంజలియై.

జనలోకంబు భవత్ప్రకీర్తనమునన్ సమ్మోదమున్ బొందు; నీ
త్యనిబద్ధాంజలియై భజించునిను సిద్ధశ్రేణి; దైత్యుల్ పలా
యనమున్ జేతురు. చేవదక్కినినుగన్నంతన్; హృషీకేశ! ఇం
తనగా జాలని నీమహాత్మ్యతకు యుక్తంబుల్ గదా ఇన్నియున్.

ఏల మ్రొక్కడు జగము దేవేశ! నీకు,
బ్రహ్మకును నీవె ఆదికర్తవు మహాత్మ!
సత్తకు అసత్తకును విలక్షణుడవైన
అక్షరము నీవె, అభవ! అనంతవీర్య!

ఆదిదేవుడవీవు, వేద్యము వునీవు,
వేత్త వేకాశ్రయుండవు విశ్వమునకు,
అపునరావృత్తియగు పదంబవు, పురాణ
పురుషుడవు, జగద్వ్యాపివి, పరమ పురుష!

నీకు మ్రొక్కెదవేసార్లు లోకమాన్య!
ఏటికోళ్ళివె నీకు నా ఏడుగడకు
మొకరిల్లుదు నీకు నే ముందువెనుక!
దేవ! చేమోడ్తు నీకన్ని దెసలనుండి.

తడవులనుండి నిన్ను పరతత్త్వవిదుల్ కొనియాడగా, స్వయం
భుడవు, పరాత్పరుండవని బుద్ధినెఱింగియు, సంతలోనె, నె
య్యుడవని, మేనబావ వనియుం దలపోసి, అలక్ష్య దృష్టినై
నడచుచునుందు నేనకట! నాయవివేకమహాత్త్వమెట్టిదో!

మేలమాడితి, నవ్వితి, నాలిగొంటి,
నిన్ను సామాన్యబాంధవుని గదలంచి
కేళిసల్లాపభోజనవేళలందు
అన్యుల సమక్షమునను, ఏకాంతమునను.

తండ్రివీవు చరాచరాత్మకజగతికి,
పూజ్యపదుడవు, సర్వోత్తముడవు నీవు,
సముడులేడు జగత్త్రితయమున నీకు
అధికుడెటుకల్గు అప్రతిమానుభావ!

కనుక జగచ్ఛరణ్యా! పదకంజములంబడి మ్రొక్కి వేడెదన్
తనయుని తప్పిదంబు దలిదండ్రులు, భృత్యుని తప్పు స్వామియున్,
తన ప్రియురాలి నేరమును తత్ప్రియుడున్ క్షమియించురీతి, వా
రని కృపసైపవే మదపరాధములం గరుణాపయోనిధీ!

కంటి నదృష్టపూర్వమును, కంటినపూర్వముదంబు, కాని, మి
న్నంటి ప్రచండమైన భవదాకృతి నెక్కువసేపు చూడలే
కుంటి, భయంబునన్ వడకుచున్నది నామదితోడమేను, నీ
తొంటి ప్రసన్నరూపము యదుప్రభు! చూపుము నాకు క్రమ్మఱన్

ధరియింపుము నీ మునుపటి
స్వరూపమును, ఖడ్గచక్రచాపగదాది
స్ఫురితచతుర్భుజములతో
పరమేశ్వర! విశ్వరూప! బాహుసహస్రా!

శ్రీ భగవంతుడు :

మదమోఘయోగబలమున
సుదుర్లభంబనక నీకు చూపితి నాయీ
మొదలిటిరూపము, నీ యెడ
హృదయంబు ప్రసన్నతామహిమ బొందుటచే.

దానములుం, దపంబులు, సుదక్షిణయాగములున్, నదీనద
స్నానములున్, జపంబులును, సాధునిషేవణముల్, వ్రతంబులున్,
ధ్యానములున్, సమగ్రనిగమాధ్యయనంబులు చేసి చేసియున్
కానగలేరు దీని, విను కానగ నోచితి వీవె అర్జునా!

వ్యాకులుడవు, వికలమతివి
కాకుము నా విశ్వమూర్తి గని, ముందటి సౌ
మ్యాకృతి వహింతునిక, ని
ర్భీకుడవై, చూచి, ముదితహృదయుడ వగుమీ.

స ం జ య ు డ ు :

అని గోవిందుడు ముందుగ
తన వైష్ణవమూర్తి జూపి, తరువాత మనో
జనితభయము డిపి, తగ న
ర్జును చేర్చెను, సౌమ్యమనుజరూపధరుండై.

అ ర్జు ను డు :

ఏ నిపుడు సౌమ్యమగు నీ
మానుషరూపమునుచూచి, మధుసూదన! ఎం
తేనియు స్వస్థుడనైతిని,
నానైజము, నా సచేతనత్వము గంటిన్.

శ్రీ భ గ వ ం తు డు :

కురువీర! సుదుర్దర్శం
బరయగ నీకనిన యామదాకృతి, సాక్షా
త్కారణీయము యోగులకును
సురవరులకుగూడ, నీకె చూపితి గరుణన్.

వేదాధ్యాయులు చూడలేరు, తపసుల్ వీక్షింపగాలేరు, నా
నాదాన క్రతుకర్మ కర్మఠులు కానన్ లేరు, వేదాంతసం
వాదప్రౌఢులు కాంచలేరు, పరమున్, భక్త్యేకగమ్యున్ ననున్
నీ దర్శించిన యీ స్వరూపమున, కుంతీపుత్ర! వేయేటికిన్.

వాఙ్మనఃకాయముల శుచిత్వము, అనన్య
భక్తియుక్తియు గలవాడె శక్తుడగును,
వత్స! ఏవంవిధుని నన్ను వాస్తవముగ
తెలిసికొనుటకు, కనుటకు, కలియుటకును.

నా నిమిత్తమె కర్మలై, నన్నెచరమ
గమ్యముగ నెంచి, సకల సంగములు రోసి,
పగ ఎవరిపట్లలేని నా భక్తుడెవడు,
వాడు భవముక్తినందు, నా భావమందు.



# భక్తియోగము

అర్జునుడు:

పరమాశ్చర్యగుణస్వరూప సగుణ
బ్రహ్మంబుగానెంచి, కొం
దరు నిన్నున్ భజియింప, కొందరనుసం
ధానింతు, రవ్యక్తముం

పరతత్త్వంబునునైన నిర్గుణపర
బ్రహ్మంబుగానెంచి, ఈ
శ్వర! వీరిద్దరిలోన యుక్తతముగా
భావింతు వీవెవ్వనిన్.

శ్రీ భగవంతుడు:

సగుణనిర్గుణ పర్యుపాసకులలోన
వాసియనుమాట లేదు, శ్రద్ధా సమగ్రు
లై యెవరునన్ను మనసు నాయందె చొనిపి
సంతతము యుక్తులై యుపాసింతు, రట్టి
భక్తులే నా మతంబున యుక్తతములు.

స్థిరసంకల్పముతో, నిజేంద్రియమనో జిత్త్వంబు సాధించి, అ
క్షరు, నవ్యక్తు, నచింత్యు, నాద్యు, నచలున్, సర్వత్రగున్ నన్ను ఎ
వ్వరుపాసింతురు, సర్వభూతహితులెవ్వా, రా మహాజ్ఞానవ
త్పురుషశ్రేష్ఠులు నన్నెకాని, అవలన్ పొందర్ పునర్జన్మమున్.

అధికతరము ప్రయాస, మవ్యక్తమైన
బ్రహ్మమున నిష్ఠలయిన ఉపాసకులకు;
నియతచిత్తేంద్రియుడెకాని నెగ్గలేడు,
అగుణసముపాసనమున దేహాభిమాని.

అమరేంద్రాత్మజ! సర్వకర్మములు నాకర్పించుచున్, నన్ను ని
త్యము ధ్యానించుచు గొల్తురేజను, లనన్యంబైన యేకాంతయో
గముచే: అట్టి మదర్పితాత్ములగు భక్తశ్రేణి జేపట్టి శీ
ఘ్రమె దాటింతును మృత్యుసంసరణపారావారమున్ జెప్పనై.

నాయందె మనసు లగ్నము
సేయుము, నాయందె తిరము సేయుము బుద్ధిన్:
పాయక, నీవటు పిమ్మట
నాయందే నిలువగలవు నమ్ముము నన్నున్.

నీ మనోబుద్ధులు నామీద నొకవేళ
 నిలకడగా నిల్పనేరవేని,
సమధికాభ్యాసయోగమున నా పయివాని
 నిలుప ప్రయత్నింపవలయు నీవు:
అభ్యాసమును అసాధ్యంబేని, నామీద
 గురిగల్గి మత్కర్మపరుడవగుము,
తగుకర్మములు మదర్థము చేసినంజాలు,
 అఱచేతిదగును నీ కాత్మసిద్ధి:
అట్లుచేయుటకూడ నీకలవికాని
పక్షమున వచ్చి, నీవు నా ప్రాపుగోరి
ఆత్మసంయమవంతుడవై త్యజింపు
సకలకర్మఫలంబులు సవ్యసాచి!

అమల జ్ఞానముకాదె పేలుతర మ
భ్యాసంబు కంటెన్, వరే
ణ్యము జ్ఞానంబునకంటె సమ్యగచల
ధ్యానంబు కౌంతేయ! ధ్యా

నము కంటెంగడు పెద్ద కర్మఫల స
న్న్యాసంబు, సంసార బం
ధము వాయుం, గలుగుం బ్రశాంతి, ఫలస
న్న్యాసంబుచే పిమ్మటన్.

అఖిల భూతములందు అద్వేష భావంబు,
కరుణయు, మైత్రియు నెరపువాడు,
సతతసంతృప్తికి, సహనంబునకు, మనో
జయితకు సంకేతమయినవాడు,
పరులను దాభయభ్రాంతుల జేయక,
పరులకు దా భయపడనివాడు,
సుఖదుఃఖములకు, అసూయాభయోద్వేగ
హర్షంబుల కతీతమయినవాడు,
సర్వసంకల్పరహితుడు, సరళహృదయు
డలఘుశుచియు, సదా సీదాదిగాగ
అస్మదర్థ మనోబుద్ధులయిన నాదు
భక్తజనులకు నేగూర్తు పొందపేయ!

చెలగి హర్షింపడెవడు, ద్వేషింపడెవడు,
కుందడెవడు, ప్రియంబును కోరడెవడు,
ఆ శుభాశుభఫలపరిత్యాగియైన
భక్తిపరు డన్న అత్యనురక్తి నాకు.

మమకారాహంకారపు
ల మడిం టోసినీని నిష్కళంకులు, విరజ
స్తములు, యదృచ్ఛాలాభ
ప్రమనులు! మునిజనులు ప్రేమపాత్రులు నాకున్.

శత్రుమిత్రులయెడ సదాసముడెవండు,
సముడెవండు మానావమానములపట్ల,
చలికి, వేడికి, సుఖదుఃఖములకు నెవడు
వికృతినొందడు, వాడు నా ప్రియుడు పార్థ!

అపరిగ్రహుం, డఖిలారం
భపరిత్యాగి, పటుభక్తిమంతుడు, ధీరుం,
డపగతఖేదుడు, మౌనియు,
నిపుణుడు, యోగియును, దృఢవినిశ్చయమతియున్;

నిరవద్యుడు, నిస్సంగుడు,
నిరాశ్రయుడు, నిత్యతుల్యనిందాస్తుతియున్
నిరపేక్షుడు, నియతాత్ముడు
నిరతస్థిరమతియు నాకు నింతురు నెమ్మిన్;

అమృత స్వరూపమగు ధ
ర్మమిది, యథోక్తముగ దీని శ్రద్ధాళువులై
సముపాసించుచు నందే
రమించు భక్తులు మహానురక్తులు నాకున్

# త్రయోదశాధ్యాయము

# క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము

అర్జునుడు:

క్షేత్రమనగనేది? క్షేత్రజ్ఞుడెవ్వడు?
ప్రకృతిపురుషులెవరు? పరమపురుష!
ఎఱుగఁబలుకునాకు, మరియు జ్ఞానజ్ఞేయ
ములనుగూర్చి తెలియవలతు దేవ!

శ్రీభగవంతుడు

వేసితివి మంచిప్రశ్నలు, విను వినాశ
శీలమగు ఈశరీరము క్షేత్రమనియు,
దానివిషయ మెవ్వడెరుగు క్షేత్రజ్ఞుడతడె
అనియు నందురు తద్విదులైన బుధులు.

క్షేత్రములన్నిటిలోపలి
క్షేత్రజ్ఞుడ నేనె విశ్వసింపుము, క్షేత్ర
క్షేత్రజ్ఞ పరిజ్ఞానమె
పార్థా! విశిష్టతమము జ్ఞానంబులలో

అలమహాభూతవర్గ, మహంకృతియును,
బుద్ధి, అవ్యక్తమును, మనంబును, దశేంద్రి
యములు, మరియు, పంచేంద్రియార్థములు గలసి,
క్షేత్రమేర్పడునని నిర్వచింత్రు బుధులు.

ఆత్మసంయోగమున క్షేత్రమందు పుట్టు
వికృతులని చెప్పుదురు, వానివినుము, ద్వేష,
మిచ్ఛయు, సుఖంబు, దుఃఖంబు, ఇంద్రియప్ర
వృత్తులును, చేతనయు, మనోధృతియు పార్థ!

తనుదానె పొగడుకొనమియు,
వినయము, కపటంబులేమి, వృద్ధగురూపా
సనము, శుచిత్వ, మహింసయు,
అనహంకారంబు, క్షమయు, ఆర్జవరతియున్.

సమధికచిత్తేంద్రియసం
యమనము, నిజదారసుతగృహాదులయెడ ని
ర్మమతయు, తనయిష్టాని
ష్టము లొదవినయపుడు సతతసమచిత్తతయున్.

జనతాసంసర్గవిస
ర్జనము, వివిక్తప్రదేశసంవాసంబున్,
అనసూయయు, మద్గతమగు
అనన్యయోగంబుతోడి అచలితమతియున్.

మానసమున అధ్యాత్మ
జ్ఞానము నిత్యంబు సేత, సమ్యక్తత్త్వ
జ్ఞానార్థదర్శనంబును,
మానవతామతియు, నిరుపమస్థయిర్యంబున్.

జననజరారోగమరణ
జనితమహాదుఃఖదోషసంతత్యనుద
ర్శనము ననువీని జ్ఞానం
బనితెలియుము, తద్విరుద్ధ మజ్ఞాన మగున్

అమృతగతికేది నిచ్చెనయగును నీకు
అటిజ్ఞేయము ప్రవచింతు నాలకింపు,
అక్షరంబది, సదసద్విలక్షణంబు.
బ్రహ్మమని, ఆత్మయని చెప్పబడు అనాది.

మనకెల్ల యెడల గనపడు
కనులును, మొగములును, తలలు, కాళ్ళును, చేతుల్,
తనవిగ, ఇచ్చటనచ్చట
యనకది అలముకొనియుండు యావజ్జగతిన్.

ఇంద్రియముల జాడ ఎందుగన్పడకున్న!
ఇంద్రియముల చర్యలెల్ల నడపు;
అండయగు, అసక్తమయ్యు సర్వమునకు;
అగుణమయ్యు, గుణము లారగించు.

ప్రాణికోటికి బయట లోపలను వెలయు,
బ్రహ్మము చరాచరస్వరూపములతోడ,
కానరాకుండు సూక్ష్మతకారణముగ;
దూరముగనుండు విషయసక్తులకెకాని,
చెంగటను మేరువగు శుద్ధచేతసులకు.

అవిభిన్నమయ్యు తోచును
వివిధక్షేత్రములలో విభిన్నాకృతులన్,
భువనోద్భవస్థితిప్ర
త్యవహారావృత్తులెల్ల ఆత్మకులీలల్.

వెలుగులకుగూడ ఆరని
వెలుగిచ్చెడు మేటివెలుగు, విను, చీకటి క
వ్వలివంక నుండు వెలుగది
తెలివియు, తెలియంగదగినదియు అదియెఱుఁగుమి

ప్రకృతియన, మాయ యనగ, క్షేత్రంబనంగ
పార్థ! నామాంతరంబు లవ్యక్తమునకు,
బ్రహ్మమున కన్వయించు క్షేత్రజ్ఞుడనగ,
పురుషుడన, జీవుడనగను భోక్తయనగ.

ప్రకృతిపురుషులనగ జరగు నీయిరువురు
ఆదిరహితులనియు, అదియెకాక
ప్రకృతినుండిపుట్టు బహువిధవికృతులు
గుణములనియు తెలిసికొనుము విజయ!

పురుషసాంగత్యవశమున స్ఫూర్తినంది
ప్రకృతియె సృజించు, కార్యకారణము లనెడు
ప్రాణులశరీరముల, ఇంద్రియాదికముల
పురుషుడు తదీయసుఖదుఃఖముల భుజించు

ప్రకృతినాశ్రయించి, ప్రకృతినుండిజనించు
గుణగణమును పురుషు డనుభవించు,
ఆగుణాభిరతియె అతని యోగ్యాయోగ్య
గర్భజననములకు కారణంబు.

పురుషుడు స్వతంత్రుడై, యీ
శరీరమునవెలయు; అతడుసాక్షియు, విభుడున్
పరిభోక్తయు; అతడెమహే
శ్వరుడును, నుతికెక్కినతడె పరమాత్మనిగన్.

ఆరసి, పురుషు డాత్మయనియును, సవికార
యయిన ప్రకృతి మిథ్యయనియు నెరుగు
బుద్ధిమంతు డెల్ల పోకల బోయిన
మరలబోడు గర్భనరకమునకు.

ధ్యానయోగముచే తమయందె కందు
రాత్మబలమున, కొంద రాత్మానుభూతి,
కందు రితరులు జ్ఞానయోగమునగాని,
గాఢనిష్కామకర్మయోగమునగాని

మరికొంద రవి ఎఱుంగక
గురూపదేశమున నమ్మికొలుతురు నన్నున్
తరియింతురు, భారత! శ్రుత
శరణ్యులగు వారుకూడ సంసారంబున్.

వినుము చరాచరజీవుల
జననంబును ప్రకృతిపురుషసంయోగఫలం
బని భావింతు, రవిద్యా
జనితాధ్యాసము తదీయసంగము మరయన్

సమముగ సమస్తభూతదేహముల వెలసి
తెగిన ఆదేహములతోడ తెగకయుండు
వానిగా, ఎవ్వడనుభవజ్ఞానయుక్తి
ఆత్మదర్శించు, వాడె యథార్థదర్శి

విశ్వమంతట సమముగ వెలసియున్న
ఆత్మతత్త్వము దర్శించునట్టి యోగి
కోరి, తనుదానె హింసించుకొనడుగాన
అమృతగతినొందు, ఆయ దేహాత్మదర్శి.

పార్థ! దేహేంద్రియాకృతి బరిణమించి,
ప్రకృతియే నిర్వహించు సర్వప్రకార
కర్మములు కాన తన్నుఅకర్తఅనియె
చూచునెవ్వడు నిక్కము చూచునతడు.

జగతి వేర్వేరుగా తోచు జంతుకోటి
ఒకటిగాచేరి, ఆత్మయం దుండుననియు,
ఆత్మనుండియె ప్రభవించు ననియు యోగి
ఎపుడుదర్శించు, బ్రహ్మత్వ మపుడు కాంచు.

అనభిష్వంగము, అగుణము,
అనాదియునుగాన, అవ్యయబ్రహ్మము దా
తనువున నెలకొనినను, ఏ
పనిచేయదు, చేనికంటబడ దొకనాడున్.

ఆవరించియుండు ఆకాశ మంతట
కాని అంటుకొనదు దేనినైన
ఆత్మ యట్లె వెలయు అందటితనువుల
కాని తాకబోదు వానినెపుడు.

సకలక్షేత్రములను తా
నొకక్షేత్రియె వెలుగజేయు నుజ్జ్వలదీప్తిన్
సకలభువనముల సూర్యం
డొకడె ప్రకాశింపజేయు నోజ కిరీటీ!

రూఢిగ, జడత్వమై తన్యరూపమైన
ప్రకృతిపురుషవిభేదము, ప్రకృతియొక్క
భూతములయొక్క మిథ్యాత్వమును గ్రహించి
పడయుదురు జ్ఞాననేత్రులు బ్రహ్మపదము.



# చతుర్దశాధ్యాయము

## గుణత్రయ విభాగయోగము

శ్రీ భ గ వం తు డు :

ప్రకృతినుండి పుట్టి బలిమి నిబంధించు,
దేహిబట్టి వాని దేహమందు,
శత్రుమథనకల్య! సత్త్వర జస్తమో
నామరూఢమగు గుణత్రయంబు.

వానిలోన వినిర్మలత్వంబు వలన
సత్త్వ మనపాయకరము, తేజఃప్రదంబు
పట్టి అనుకూలశత్రుపై కట్టు సౌఖ్య
పరవశతతోడ, జ్ఞానపిపాసతోడ.

సంగతృష్ణా సముత్సాహ సంభవంబు
రాగవిద్వేషమయము రజోగుణంబు
అది నిబంధించు భారత! ఆత్మబట్టి
కామ్యకర్మము మీది సంగంబుతోడ.

తమ, మజ్ఞానభవం బది
సమస్త దేహులకు గాఢసమ్మోహకమై,
సమధికనిద్రాలస్య
ప్రమాదపాశములతో నిబద్ధుని జేయున్.

మరగించు సుఖము సత్త్వము,
మరగించు రజంబు కర్మమార్గంబునకున్,
మరగించు ప్రమాదంబును,
మరపించు వివేకమును తమంబు కిరీటీ!

రక్షించు సత్త్వము రజ
స్తమముల నధరీకరించి, సత్త్వము, దమమున్
దమియించి రజము పెరుగున్
తమము రజస్సత్త్వముల నణంచి యెసంగున్.

సకలేంద్రియముల వెంబడి
అకలంకజ్ఞానరూపమగు తేజము ద్యో
తకమయ్యేనేని, వినుమది
ప్రకటించును సత్త్వగుణము ప్రాబల్యంబున్.

చొరవయు, లోభము, కార్యా
చరణ ప్రారంభణము, అశాంతియు, వగయున్.
దురహంకారము కలుగున్
కురువీర! రజోగుణము ప్రకోపించినచో

పొరపా టలవాటగు, నో
మరితన మధికమగు, చెడ్డ మంచిగ దోచున్.
విరసత్వము, మోహంబును
పెరుగు తమోగుణము పెచ్చుపెరిగిన వేళన్.

జీవితాంతమైన చిరకృషిచే సత్త్వ
మున్నదశకు వచ్చియున్న వేళ
తనువువిడుచు పుణ్యతము డుత్తమజ్ఞాన
ధనుల విమలలోకమునకు బోవు.

రజము పైచేయియైనవేళను గతించి
మానవుడు కర్మపరుల వంశమున బుట్టు,
మూఢయోనుల బుట్టు తమోగుణంబు
ముమ్మరించినయెడ గన్నుమూయువాడు.

నిర్మలసుఖంబు సాత్త్వికకర్మమునకు
ఫలమని వచింతు రార్యులు భరతవీర!
రాజసికకర్మమునకు ఫలంబు వగపు
మూఢతయె తామసిక కర్మమునకు ఫలము.

అలవడు జ్ఞానము సత్త్వము
వలన, విలోభము రజస్సువలన జనించున్,
బలవత్ప్రమాదమోహం
బులు, అజ్ఞానమును ఫలితములు తమమునకున్.

తనుపతనానంతరమున
చను సత్త్వగుణస్థు డూర్ధ్వజగతికి, మర్త్యం
బున నిలుచు రాజసుడు,చొ
చ్చు నధోలోకమును తామసుడు హీనదశన్.

కర్మములకు గుణంబులే కర్తలనియు,
సంగరహితత గుణకర్మసాక్షి యైన
ఆత్మ గుణములకంటె వేరనియు చూచు
అంచితద్రష్ట నాలోన నైక్యమగును.

ఎవడు తరియించు దేహో
ద్భవముల ఈత్రిగుణములను భారత! అతడే
భవమృత్యువిమోచనమున
అవలీలం బడయగలుగు అమృతత్వంబున్.

అర్జునుడు:

దైతేయదమన! త్రిగుణా
తీతుని ఏలక్షణముల తెలియగనగు? త
చ్చేతోవృత్తియు నెట్టిది?
అతడు త్రిగుణముల నెట్లు లతివర్తించున్.

శ్రీభగవంతుడు:

వెలుగు, ప్రవృత్తియు, మోహము
అలవడుచో అప్రియంబు లని రోయడు, ని
శ్చలుడై, త్రిగుణాతీతుడు
వలవడు ప్రియములని వాని పై దొలగినచో.

చలియింపడిట్లు గుణకృత
ములకు గుణాతీతుడైన పురుషుడు, గుణముల్
వెలయించు స్వకార్యములని
తలచి, సదా వానియెడ ఉదాసీను డగున్.

స్తుతినిగర్హణముల, సుఖదుఃఖముల, లాభ
నష్టముల సమానదృష్టి యుండు
భేదభావముండబోదు వానికి మట్టి
గడ్డయందు పసిడికణికయందు.

పార్థ! ఏవంవిధశ్లాఘ్యవర్తనమున
వలయువారును వలవనివారులేక
సర్వసంకల్పవర్జనశాలి యైన
ఆత్మనిరతు గుణాతీతు డండ్రు బుధులు.

సంతతము నన్నె అవ్యభిచారిభూరి
భక్తియోగముతోడ ఎవ్వడుభజించు
త్రిగుణముల అతడును సమతిక్రమించి,
బ్రహ్మభూయోపలబ్ధికి పాత్రుడగును.

అమృతము, అవ్యయంబును, అనాదియునై పరతత్త్వమైన బ్ర
హ్మమునకు; దానిబొందగ సముంచితసాధనమైన నిత్యధ
ర్మమునకు· ధర్మనిష్ఠకు సమగ్రఫలంబగు నిర్వికల్పసౌ
ఖ్యమునకు నేనెఆశ్రయము; కావున భక్తులకిత్తు మద్గతిన్.

# పంచదశాధ్యాయము

# పురుషోత్తమ యోగము

శ్రీ భగవంతుడు :

ఊర్ధ్వమూల, మధస్కంధయుతము పార్థ!
ప్రబలసంసార మను చిరాశ్వత్థతరువు,
వేదములు పత్రవితతిగా విస్తరిలిన
దానివిధ మెవ్వడెఱుగు వేదజ్ఞు డతడు.

దిగువ కెగువకు ప్రసరించు, త్రిగుణవర్ధి
తములు, విషయప్రవాళగుచ్ఛములు నైన
దానికొమ్మలు, మనుజకర్మానుబంధి
మానరోషాదికంబులు దానివేళ్ళు.

దాని యారూపు జడునకు కానరాదు,
తుదయు మొదలును నడుమును తోపకుండు,
పీటపెట్టిన యామ్రాని బెల్లగించు
గండ్రగొడ్డలి పెనువిరాగంబె సుమ్ము.

వినుము మును దాని దుదముట్ట దునిమి, అవల
ఎవనినుండి అనాదిగా యీప్రవృత్తి
సాగు ఆయాదిపురుషుని శరణుసొచ్చి
వెదుకదగు నిత్యమైన తత్పదము బుధుడు.

అలసుల్ చేరగలేరు యోగపరులై యత్నించి నిర్మానమో
హులు, నిస్సంగులు, నిర్వికారులు, నిరీహుల్, నిశ్చలాధ్యాత్మని
త్యులు, నిర్ద్వంద్వులు, నిత్యతృప్తనియతాత్ముల్ కాని గాండీవి! ని
ష్కలుషం, బవ్యయ, మద్వయంబునగు ఆ సర్వోన్నతస్థానమున్

దాని వెలిగింపజాలరు
భానుడు, చంద్రుడును, శిఖియు, పరమంబగు నా
స్థానమది, అచటికేగిన
వానికి లేదెన్నటికి నివర్తన మనఘా!

అవ్యయాత్ముడనైన నాదగు సనాత
నాంశమే లోకమున జీవుడై జనించు;
పార్థ! అతడె ఆకర్షించు ప్రకృతిలోన
లీనమైన మనంబు నింద్రియగణంబు.

కర్మవశమున వేరొక కాయమునకు
అరుగునప్పుడు పూర్వకాయంబునుండి,
వెంటగొని యేగు జీవుడు వీనిగూడ
స్థానముననుండి గాడ్పు గంధమునుబోలె.

జ్ఞానేంద్రియపంచకమును
మానసమును పొందవేయమధ్యమ: స్వాధి
ష్ఠానములుగాగ జీవుడు
నానావిషయోపసేవనంబున దేలున్.

అర్జున! శరీరమందున్న యపుడుకాని,
దాని వీడ్కొని చనునెడగాని, సగుణు
డగునపుడుగాని, విషయము లారగించు
నప్పుడునుగాని, చూడలేరజ్ఞు లతని,
జ్ఞాననేత్రులు చూతురు సంతతంబు.

తనయందె వెలుగు నాత్మని
మనమంతర్వర్తిజేసి, మరిబాహ్యగతిన్
జనసీక యోగి కనుగొను;
కనలేదకృతాత్ము డెంతకడగియు విజయా!

ఆదిత్యాంతర్గతమై
ఏది ప్రకాశింపజేయు నెల్ల జగంబున్,
దేదీప్యమానమగు ఆ
ఆదిమతేజము మదీయమని ఎఱుగు మనా

ఉర్వియందుజొచ్చి, ఓజోగుణంబున
నిఖిలభూతములను నేధరింతు;
అమృతరసమయాత్ముడైన చంద్రుండనై
పోషకుండనగుదు నోషధులకు.

నేను జఠరాగ్నిరూపున
ప్రాణులదేహముల నిలిచి పచనము సేతున్
ప్రాణాపానసహాయుడ
నై నిత్యము తచ్చతుర్విధాహారములన్.

ఎల్లహృదయంబులను వసియింతు నేను,
స్మరణమును, తెల్వియును, మతిమఱపు కలుగ
కారణము నేను, వేదాంతకర్త నేనె,
వేదవేద్యుడ, వేదకోవిదుడ నేనె.

కలరు లోకమందు క్షరుడు, అక్షరుడని
పురుషులిరువు రందు పురుషతిలక!
సకలభూతగణము క్షరునిగ, కూటస్థు
అక్షరునిగ బలికి రాది ఋషులు.

పరమాత్మయనగ ఉత్తమ
పురుషుడు వేఱొకడు కలడు, భువనత్రయమున్
భరియించు సతం డభవుడు,
పరమేశ్వరు, డవ్యయుండు, పరతత్త్వంబున్

క్షరునకు అతీతుడను, అ
క్షరుకంటె మహోత్తముడను: కావున గంటిన్
కురువీర! నే ప్రసిద్ధిని
పురుషోత్తముడనుచు లోకమున, వేదమునన్.

పురుషోత్తముడను నేనని
ఎరయు అసమ్మోహబుద్ధియై నన్నెవ డా
నిరఘుడు సర్వజ్ఞత్వ
స్ఫురితుండై సర్వభావమున గొలుచు ననున్.

సారంబగు ఈశాస్త్రము
దారార్థయుతంబు, గుహ్యతమము గానన్
ధీరోత్తమ! అంతఃకర
ణారూఢము సేసికొని, కృతార్థుడ వగుమీ!

# షోడశాధ్యాయము

## దైవాసురసంపద్విభాగయోగము

శ్రీభగవంతుడు:

సీ॥ అభయం, బహింసయు, ఆత్మసంశుద్ధియు,
ఉపరమంబును, జ్ఞానయోగనిష్ఠ,
దానంబు, త్యాగంబు, దమము, మార్దవమును,
తప, మార్జవంబు, స్వాధ్యాయనిరతి,
సమత, అచాపల్యంబు, సత్యంబు, శౌచంబు,
క్రతుపరాయణత, హ్రీగౌరవంబు,
తేజంబు, క్షమయును, ధృతియు, నుత్సాహంబు,
నిండుతృప్తియు, గర్వనిరసనంబు,
నిఖిలభూతానుకంపయు, నిర్వికృతియు,
కొండెములు చెప్పకుండుట, గురుసపర్య,
చాపలము లేమి, పరిమితసల్లపనము,
ప్రకృతిగుణములు దైవసంపద్భవులకు

పరవంచనయు, దురాశయు,
అరయమియును, దర్పమును, దురభిమానంబున్
పరుసదనంబును నైజము
అరిసూదన! అసురసంపదభిజాతులకున్.

దైవీసంపద నిర్మో
క్షావహము, నిబంధహేతు వాసుర మరయన్;
దైవీసంపద్భవుడవె
కావున నుమ్మలిక వలదు కవ్వడి! నీకున్.

దైవము, ఆసురము నని యీవిధమున
ఇరువెలుగు భూతగణసృష్టి ఇజ్జగమున
దైవమును, విస్తరముగ విన్నావు గాన
వివరముగ ఆసురమునుగూర్చి వినుము విజయ!

శౌచముకల్ల, హానికి స
దాచారము, కానివాపు, లార్జవయుతముల్,
గోచరములుకా వుబ్బున
నేచిన యాజాతులకు ప్రవృత్తినివృత్తుల్.

"కామప్రేరితకామినీపురుషసాంగత్యంబె యీసృష్టికిన్
తామూలంబు, జగంబనీశ్వర, మసత్యం, బప్రతిష్ఠంబు, ని
త్యామోదంబొడగూర్చుభోగములు గ్రాహ్యంబుల్ సదా" యంచు ఆ
వామాచారులు నొక్కిపల్కుదురు, దుర్వాచాలతాలోలురై.

సీ॥ నిందింపరాని గొంతెమ్మకోరికలకు,
మానదర్పములకు జానిసలుగ,
సంచరింతురు, శతాశాపాశబద్ధులై,
తమకించి అశుచివ్రతములదగిలి,
కడుమోహమున అసద్గ్రాహంబు తాల్చియ
పురుషార్థసేవయే పరమమనుచు
కాంక్షింతు రవిరతకామభోగనిమిత్త
మర్థసంచయము నన్యాయసరణి;
ఆత్మనాశముతో దీరు అపరిమేయ
చింతతో, మీఁదెరుంగ, కత్యంతఘోర
కర్ములై, సాధుసంక్షోభకారు లగుదు
రల్పబుద్ధులు, నష్టాత్ములయిన వీరు.

"ధనవంతుండను, సత్కులీనుడను, మేధావంతుడన్, శక్తుడౌ
ననుడన్, త్యాగము భోగముంగల మహాసంకల్పసిద్ధుండ, లో
కనియంతన్, బలశాలినేనె" యనుచున్ గర్వింతు రాబాలిశుల్
"నను బోలంగలవాడు లే"డనుచు నానాచిత్తవిభ్రాంతులై

అలయక తమ్ము దామె గొనియాడుచు, పెద్దల దూలనాడుచున్
తెలివిదొఱంగి, ఆత్మపరదేహములందు వెలుంగు నామెడన్
కలవనగంపలై,! విడువగానక, యాసురజాతి బుట్టుచున్
పొలియుచు వారభోగతికి బోవుచునుందు రితో ధికంబుగన్

అరయ, మహాద్వారములవి
నరకమునకు, ఆత్మనాశనమును గానన్,
పరివర్జింపగదగు స
త్పురుషులు కామమును క్రోధమును లోభమునున్.

భారత! యీ ఘోరతమో
ద్వారవిముక్తుడగు ధీరతానిధి శ్రేయో
దారమగు శాస్త్రవిహితా
చారము చేయుాత బొందజాలును నన్నున్.

మానుగ శాస్త్రదృష్టమగు మార్గమునూని, యథేచ్ఛమై అను
ష్ఠానము సేయువాడు కనజాలడు సిద్ధినిగాన నీవు స
మ్మానముతోడ శాస్త్రము ప్రమాణముగాగొని, శాస్త్రచోదితం
బైనవిధిన్ క్రియాచరణమందు ప్రసక్తత జూపు మర్జునా!

# సప్తదశాధ్యాయము

## శ్రద్ధాత్రయ విభాగయోగము

అర్జునుడు :

శాస్త్రవిధులను విడనాడి, శ్రద్ధతోడ
యజ్ఞము, తపంబు, దానము ఆచరించు
మానవుని శ్రద్ధ ఎట్టిది ఆనతిమ్మ
సాత్త్వికమొ? రాజసమొ? తామసమొ? ముకుంద

శ్రీ భగవంతుడు :

జీవులకు స్వభావసిద్ధమై అలవడు
శ్రద్ధ సాత్త్వికంబు, రాజసికము,
తామసికము అనగ తనరు మువ్విధములు
వినుము వాని నీకు విస్తరింతు

శ్రద్ధ యలవడు పూర్వసంస్కారకలిత
మైన అంతఃకరణవృత్తి కనుగుణముగ
గుణనిధి! గుణత్రయమున ఏ గుణము నరుని
కలవడునొ, శ్రద్ధయును తద్గుణానుగుణము.

ఫలములయెడ, బ్రహ్మార్పణ
కలనపరాయణతతోడ, కరణీయమె యన్
తలపున విధివిహితంబుగ
సలిపిన యజ్ఞంబునెగడు సాత్త్విక మనగన్

ఫలముల కొఱకొ, ప్రతిష్ఠను
వలచియొ, తమ గొప్పతనము బ్రకటించుటకో
వలవని యాడంబరమున
సలిపిన యజ్ఞము రాజసంబండ్రు బుధుల్.

హీనముగా జూతురు, విధి
హీనము, వసుదానమంత్రహీనము, శ్రద్ధా
హీనము నగు యజ్ఞంబును
ధానుష్క శిరోవతంస! తామస మనుచున్.

శారీరమగు తపఃక్రియ
సాదాచారంబు, బ్రహ్మచర్యంబు, అహిం
సారతియు, దేవగురువి
ప్రారాధనమును, ఋజుత్వ, మనహంకృతియున్.

ఒరుల మనసు నొప్పింపని
పరమప్రియహిత యథార్థభాషణమును. సు
స్వరయుత నిగమాభ్యసనము,
పరగు వచోరూపమగు తపశ్చరణముగన్.

మానసికతపము మాధవు
మానవులోగనుట, నిరభిమానము, శమమున్,
మౌనంబు, భగవదనుసం
ధానంబు, మనోనియంత్రణము, శాంతతయున్.

అనియంత్రితమూఢతతో,
తనకెంతయు పీడకముగ, దాయల కుత్సా
దన హేతుకముగ సాగిన
చెనటి తపశ్చర్య తామసికమన బరగున్.

దేశకాలపాత్రముల సుస్థితి నెఱింగి
ఆత్మ నొకశంకలేక, బ్రహ్మార్పణమని,
అనుపకర్తకు, అగంతుకునకు నొసగు
దానమును స్వాత్త్వికంబంద్రు తద్జ్ఞా లనఘ!

విను, ప్రత్యుపకారార్థమొ
తన దానఫలంబుమీఁది తగులంబుననో
మనమున వగచుచు కావిం
చినదానము రాజసిక, మసిద్ధిప్రదమున్.

అనుచితస్థలమున, అనుచితవేళ, అ
పాత్రములకు నొసగబడినయట్టి
గౌరవోపచారకలితంబు కానట్టి
దాన, మధమతమము, తామసికము.

విను మర్జున! ఓమ్ తత్ సత్
అను మూడును బ్రహ్మమునకు అంచితసంజ్ఞల్
జనియించె వానినుండియె
మునుమును బ్రాహ్మణులు, వేదములు, యజ్ఞములున్.

కావున ఓంకారమును య
థావిధి ముందుచ్చరించి తలకొందురు స
ద్భావమున బ్రహ్మవాదులు
పావనములు దానమఖతపశ్చర్యలకున్.

కడగుదురు సంతతము పుణ్యకార్యములకు,
మోక్షకాములు ఫలనిరపేక్షు లగుచు,
బ్రహ్మవాచకమయిన తత్పదము భక్తి
యుక్తి ప్రణవపూర్వముగ సముచ్చరించి.

'సత్త'యను నర్థమందును
'ఉత్తమ'మను నర్థమందు యోగ్యశ్రేయో
దాత్తమగు కర్మమందు కు
రూత్తమ! సత్ శబ్దమును ప్రయోగింత్రు కవుల్.

యజ్ఞదానతపః క్రియలందు మనకు
కలుగు నిష్ఠయు సత్ అని పలుకబడును;
భగవదర్పణమతి జేయబడిన పుణ్య
కర్మములుకూడ సద్వాచకములె పార్థ!

కురువర! విహితశ్రద్ధా
విరహితమగు వితరణంబు, వేలిమియు,తప
శ్చరణమును అసత్తనబడు
కొరగావవి, ఇహము, పరము, కూర్పవు గానన్

# అష్టాదశాధ్యాయము

# మోక్షసన్న్యాసయోగము

అర్జునుడు:

"అడుగవలసి మరల నే గెద సన్న్యాస
మనగనేమి? త్యాగమనగనేమి?
విశదపరపు నాకు విడివిడిగా హృషీ
కేశ! వాసుదేవ! కేశిదమన!"

శ్రీభగవంతుడు:

పరికించి, కామ్యకర్మల
నిరసన సన్న్యాసమనిరి; విను త్యాగముగా
పరికీర్తించిరి పెద్దలు
భరతోత్తమ! సర్వకర్మఫలముల విడుపున్.

త్యాజ్యమందురు, దోషవంతంబుగాన,
కర్మమును సాంఖ్యవాదులు; కాని పార్థ!
విడువరానివి క్రతుతపో వితరణాది
మహితకర్మములెల్ల మీమాంసకులకు.

దానతపఃక్రతువులు ధీ
మానుజ! కార్యములు, అపరిహార్యము లరయన్
వానివలన పావనతయు
నానావిధపాపనిరసనంబును కలుగున్.

ఫలమును గోరక, తగులము
వలవక, కర్తవ్యములుగ, వానినొనర్పన్
వలయు; ఇది నామతంబని
పలుసారులు నీకునచ్చ బలికితిగాదే!

నియతమగు కర్మముడుఁగుట,
అయకామికి తగనిపని, తదజ్ఞానకృతం
బయిన విసర్జనము ధనం
జయ! గర్హితమగును తామసత్యాగముగన్.

వినుము దుఃఖహేతు వనియు, కాయక్లేశ
భయము గానియు నెవడు నియతకర్మ
చయము విడుచు; రాజసత్యాగమగు దాన
పడయలేడు త్యాగఫలము నతడు

తనకది విధేయమని, నిరంతరము నియత
కర్మమును నిర్వహింపుచు కర్మఫలము
సర్వదా సన్న్యసింపు నిస్సంగపరుని
త్యాగమది సాత్త్వికము పరిత్యాగశీల!

అశుభకరకర్మమున జూప డప్రియంబు,
శుభకరంబున నాసక్తి జూపబోడు,
సత్త్వగుణనిష్ఠితుడు, ఛిన్నసంశయుండు,
తత్త్వనిధి, కర్మఫలపరిత్యాగశీలి

అలవిగాదు కర్మ లనవశేషంబుగా
పరిహరింప నెట్టి నరులకైన
కాన నెవడు పూర్ణకర్మఫలత్యాగి
త్యాగి యతడె కర్మయోగి యతడె.

హిత, మహితము, మిశ్రము నగు
కృతకర్మఫలంబు విడుమనే ఫలకామున్?
మృతివెనుకను వెన్నంటును
అతులమతీ! అంటవెన్న డఫలాపేక్షిన్.

కర్మలెల్ల సిద్ధిగనుటకు కలవైదు
కారణంబు లనియె కర్మకాండ
చరమభాగమయిన సాంఖ్యశాస్త్రము, దేహి
కర్మములకు కర్తకోటి కలిపి.

అవి: దేహ, మహంకారము
వివిధేంద్రియసాధనములు, విను వానిపృథ
గ్వివిధవిచేష్టలు, మరియై
దవది, తదభిమానదేవతల ప్రేరణమున్

తనువుచేత, నిండుమనసుచే, మాటచే
న్యాయబద్ధముగనొ, అనయముగనొ
జను లుపక్రమించు సకలకర్మముల కీ
అయిదు గారణంబు లనిగ్రహింపు.
ఈనిక్క మహంకృతిచే
కానంగ నిరాకరించి, కార్యంబులకున్
తానే కర్తనని తలచు
మానవు డకృతమతి, దురభిమానియు విజయా!

ఎవ్వనికిలేదు కర్మకర్తృత్వబుద్ధి,
ఎందు నవిలిప్తమైయుండు నెవనిబుద్ధి,
అతడు పలువురజంపియు హంతకుండు
కాడు, కర్మనిబద్ధుడుకాడు నిజము.

కర్మ సంప్రేరకంబు లు కలవు మూడు,
జ్ఞానమని, జ్ఞేయమని, పరిజ్ఞాతయనియు,
కర్మసంగ్రహములుకూడ కలవు మూడు,
కరణమని, కర్మమనియును, కర్తయనియు,

వేరువేరుగ గనిపించు విశ్వభూత
వర్గమున జూచునెవడు వేర్పాటులేని
అవ్యయము, ఏకమునునైన యాత్మయునికి
సాత్త్వికము వానిజ్ఞానము సవ్యసాచి!

పరమాత్మభావము పరి
స్ఫురించు నెవ్వనికి వివిధభూతముల పర
స్పరము విభిన్నముగా, పలు
తెరగులుగా, రాజసికము తెలివది పార్థా!

సకలం బదియే యనుగతి
ఒక కార్యమునందె తగిలియుండును, నిర్హే
తుకమై, అత్యల్పము, సవి
చికిత్స మేతెలివి, తామసికమది విజయా!

ఫలములు ప్రేప్సింపమిగ
తలపున మక్కువయు, వెగటు, తగులము వెలిగా
నలుపబడు నియతకర్మము
కలిగించును సుగతి, సాత్త్వికంబన నెగడున్.

కోరిక లీరికలెత్తగ
శారీరాయాసభరము సైరించి అహం
కారమున జేయు కర్మము
వీరోత్తమ! రాజసికము, విను బంధకమున్.

అలవియు, భావిశుభాశుభ
ఫలములును, క్లేశంబు, వ్యయము, పరపీడనయున్
తలపక, మోహవశంబున
తలకొను కర్మంబు చెడును తామసికంబై.

నిత్యము కర్మియు, కర్మఫ
లత్యాగియు, సిద్ధ్యసిద్ధులకు అవికృతియున్
ధృత్యుత్సాహయుతుడు నగు
అత్యుత్తమకర్త సాత్త్వికాఖ్యుడు విజయా!

గాఢరాగి, నిరతకర్మఫలాపేక్షి
అర్థకామి, అశుచి, హర్షశోక
సంకులుడు, నిత్యచపలుడు, బహులోభి
అధమకర్త, రాజసాఖ్యవాడు.

ప్రాకృతు, డయుక్తు, డలసుడు,
శోకవ్యాకులుడు, దీర్ఘసూత్రుడు, శఠుడున్,
నైష్కృతికు, డధృతి యెవ్వం
డాకర్తయె తామసాఖ్యు డధమాధముడున్.

సవివేకనిశ్చయాత్మక
మవు జ్ఞానము బుద్ధి, త్రివిధ, మది ఎఱిగింతున్
భువనత్రయ్యభినుత్యా
త్యవిజయ్యావక్రవిక్రమాభోగనిధీ!

కనికొను భయాభయంబులు,
విను, కార్యాకార్యములు, ప్రవృత్తి నివృత్తుల్,
పునరావృత్తియు, ముక్తియు,
ఘనమగు నేబుద్ధి సాత్త్వికంబది జగతిన్.

ఇది ధర్మ, మధర్మంబిది,
ఇది కార్యము, మరి అకార్య మిదియని తఱితో
ఇదమిత్థంబుగ నెఱుగని
యది రాజసబుద్ధి యందు రార్యులు పార్థా!

ఒనర అధర్మము ధర్మం
బనియును, సర్వార్థములను వ్యత్యస్తముగన్
కనుచుండు; తమోవృతమై
జననుత! ఏబుద్ధి తామసంబది విజయా!

చిత్తప్రాణేంద్రియముల
వృత్తులు పరమాత్మమీద ఏ ధృతి వలనన్
హత్తుకొని నిలుచు, విషయని
వృత్తములై, సాత్త్వికంబు వినుమది విజయా!

ఫలభోగకలన దగులము
కల కృపణుబుద్ధి ధర్మకామార్థములం
దెలయించి నిలుపు నేధృతి
సెలవిచ్చిరి దాని రాజసిక మని విజ్ఞుల్.

వదలవు దేనిబలంబున
మదము, దురాగ్రహము, దురభిమానము, భయమున్.
నిదురయు, వగపును కుత్సిత
హృదయంబులు, తామసికపు ధృతియది పార్థా!

అభ్యసించుకొలది అంతంతకు రమించు
దేవియందు నరుడు, దేనివలన
వగలకెల్ల గాంచు తెగుదల లెస్సగా
అట్టిసుఖము త్రివిధ మనియెఱుంగు

విసమువలె మొదట దోచియు,
ఎసగుం బరిణామవేళ ఏసుఖము సుధా
రసమువలె, ఆత్మబుద్ధి
ప్రసాదజన్య మది సత్త్వభరితము పార్థా!

తొలుత సుధాప్రాయంబగు
అలయించు బరిణామమున హాలాహలమై
అలవడు విషయేంద్రియముల
కలయికచే రాజసికసుఖంబు కిరీటీ!

అసమయనిద్రాగాఢా
లసతాలోల్యప్రమాదలబ్ధము, విను తా
మసికసుఖంబది మొదలగు
వ్యసనమునో మోహనముగ, అల్లేమగియున్.

భువియందె కాదు కనమా
దివియందును ఎంతవెదకితివిరిన మాయా
భవములగు త్రిగుణములచే
వివర్జితుండయిన వాని వీరవరేణ్యా!

నిర్మానవంతుడగు నిజ
కర్మాభిరతుండు పొందు ఘనసంసిద్ధిన్,
ధార్మికశేఖర! విను నిజ
కర్మాభిరతుండు సిద్ధి గనగల విధమున్.

భూతప్రవృత్తి కెవ్వడు
హేతువు, సర్వమయు, నతని, హేతువిరహితున్
ప్రీతి నిజకర్మకరణము
చేత నుపాసించి సిద్ధిజేకొంద్రు బుధుల్.

విగుణంబయ్యు, స్వధర్మమె
తగు, సువిహితమైన పరులధర్మముకంటెన్
తగులక, స్వభావనియతం
బగు కర్మమునడపి, పొందడఘ మెవ్వండున్.

విను దోషవంతమైనను
తనకు సహజమైన కర్మ తప్పనిసరి సు
మ్మనలము ధూమముచే బలె
అనఘా! దోషావృతములె అఖిలక్రియలున్.

మతి దేనియందు దగులని
గతాశి, విజితేంద్రియుండు కర్మాతీత
స్థితిరూపసిద్ధి బడయును
ధృతిమందర! కర్మఫలపరిత్యాగమునన్.

ఈపగిది సిద్ధిబడసిన
ఆపురుషుడు బ్రహ్మభావ మందగ దేనిన్
చేపట్టవలెనొ, చెప్పెద
ఆపరమజ్ఞాననిష్ఠ అతిసూక్ష్మముగన్.

చలమానసమును నిజధృతి
బలమున నరికట్టి, బుద్ధిపరిశుద్ధతతో,
వలపును, ఒల్లమియును మది
మొలకెత్తగనీక, విషయములకును వెలియై;

మితభోజియై, వివిక్త
వ్రతియై, అస్ఖలితనియతవాక్కాయమనో
గతియై, వైరాగ్యసుసం
యుతుడై, నిత్యంబు ధ్యానయోగపరుండై.

మమతయు, అహంకృతియు, ద
ర్పము, కామక్రోధములును, బలము, నిజస్వా
మ్యమును దిగనాడు శాంతుం
డమలుడు బ్రహ్మైక్యమునకు అర్హతగాంచున్

వగవఁడు, వలవఁడు, జంతుల
కగపడఁడు, ప్రసన్నహృదయుఁడై, సర్వసముం
డగు, బ్రహ్మభూతు డట్టన।
ప్రగాఢముగనొందు మత్పరాదృఢభక్తిన్.

తనభక్తివలన నను, నా
ఘనప్రభావంబు నతఁడు కలయా పెరుగున్,
నను కలసూ పెరిగిన యత
డనంతరము వచ్చి లీనమగు నాలోనన్.

నిరతం బశేషకర్మా
చరణపరుండయ్యు, మత్ప్రసాదమువలనన్,
కురువీర! పడయు నాతఁడు
పరమంబగుపదము, మద్వ్యపాశ్రయుఁ డగుటన్

మానసికముగ సకలకర్మములు నాకె
అర్పగింపుము, నన్నె ప్రాప్యముగ నెంచి,
అచలితధ్యానయోగము నాశ్రయించి,
మనసు నాయంచె నిలుపుము మాపురేపు

అనిశము మదేకచిత్తుఁడ వగుదువేని
కడవఁగలుగుదు వీవాడుదుడుకులెల్ల
కాని నామాట నీవహంకార మూని,
పెడచెవిని బెట్టఁజూచిన చెడకపోవు.

ఆలము సేయనేనని అహంకృతినందువుగాని, నిల్పఁగా
జాలవు నీవినిశ్చయము; క్షాత్రరజోగుణజన్యమై, మరు
త్పాలతనూజ! నీదగుస్వభావమె నిన్ను బలాత్కరించి, యా
జోలికిలాగు, నీదు రణశూరత నిన్నెలయించు బోరికిన్.

నీవేకార్యము నవివే
కావేశమువలన జేయనంటివి, దానిన్
కావింపకుండలేవు స్వ
భావజనితకర్మఫలనిబద్ధుడ వగుటన్.

హృదయసీమల నెలకొని యీశ్వరుండు
మాయచే బట్టియాడింప మానవాళి
ఆడు, జంత్రపుబొమ్మల ట్లంతెకాని,
అలవికాదెవ్వనికి ఇచ్చకొలది దిరుగ.

కాన శరణంబు వేడుము
వానిని హృదయస్థు సర్వభావమున, అనా
దీనవశాంతియు, నిత్య
స్థానంబును బడయగలవు తత్కృపవలనన్.

జ్ఞాన మిటునీకు గలిపితి నవివరముగ,
గుహ్యమున కంటె మిన్నది గుహ్యతమము
తడయక అశేషముగ దీని దలచిచూచి,
వలసినట్లు ప్రవర్తింప వచ్చు నీవు

మరల నొకమాట వినుమది
కురువరః తారకము, సర్వగుహ్యతమంబున్,
పరమప్రియుడవు కావున
ఎరిగింతును నీకు మేటిహిత మనురక్తిన్.

మన్మనస్కుఁడవుము, మద్భక్తుఁడవు కమ్ము
నాకొనర్పుమెపుడు నతులు, నుతులు,
నన్నె కలియగలవు, నాకిష్టుఁడవు గాన
పలికినాఁడ నిజము బాసచేసి.

సర్వధర్మకలాపము సన్న్యసించి,
గురిగలిగి యొక్కఁడని నన్నె శరణుసొరుము,
నిన్ను సాకల్యముగ నేనె నిఖిలపాప
బంధములనుండి విడిపింతు వగవ వలదు.

ఈ ధర్మసంవాద మెవ్వఁడు పఠియించు,
  అతఁడు చేకొను జ్ఞానయజ్ఞఫలము;
అనసూయుఁడై ఎవ్వఁ డాస్తిక్యమతి దీని
  ఆలించు, భవముక్తుఁ డగు నతండు;
బోధించునెవ్వఁడు భూరిగుహ్యము దీని
  నా భక్తులకు, వాఁడు నన్ను జేరు;
అట్లు బోధించిన యతనికంటెను లేఁడు
  పరమప్రియుఁడు నాకు నరులలోన

విషయసంసక్తునకు, తపోవిరహితునకు,
అలసునకు, భక్తిహీనున, కకృతమతికి
ఈ మదీయప్రభూతగీతామృతమును
వీనుగవ నింపకుము పాండవేయతిలక!

అవధానంబున, డెందం
బివురెత్తగ నాలకించితే నా పలుకుల్?
అవసాదంబంపెనె నీ
అవివేకోదితవిమోహపంతయు విజయా!

అర్జునుడు :

"మోహావేశముమాసె, బోధమునను న్మందంబువేయించె, సం
దేహంబెల్ల గతించె, నీ కరుణచే దెల్వొందితిన్, నీ హిత
వ్యాహారానుగుణంబుగా, జగము సంభావింపగా, సర్వని
ర్వాహప్రౌఢవినోద! లేచి ఇక నిర్వర్తింతు సంగ్రామమున్"

సంజయుడు :

"పరవశము నొంది వింటిని
కురువల్లభ! వెండ్రుకలు గగుర్పొడువంగా
హరికి, ధనంజయునకు నిటు
జరిగిన అద్భుతవిధాయిసంవాదంబున్.

పనిపడి యోగేశ్వరుడగు
వనజాక్షుడు స్వయము మధురవచనప్రౌఢిన్
వినిచిన యోగవిధానము
అనుసంధించితి మహాత్ముడగు వ్యాసుకృపన్.

నిరతిశయమోదమున, ఉ
క్కిరిబిక్కిరియగుదు దేవ! కృష్ణుల ఏనో
హరమగు నీ సంవాదము
స్మరియించి, స్మరించి, మాటిమాటికి నిపుడున్.

దానవరిపు తేజోమయ
నానాద్భుతరూపమును మనంబున అనుసం
ధానింపుచు పులకోద్గమ
పౌనఃపున్యమున పారవశ్యము గందున్.

కురువర! ఎచ్చట యోగే
శ్వరుడగు నారాయణుండు, శౌర్యోజ్జ్వలు డా
నరుడును వసింతు, రచ్చట
అరుదే సిరియును, జయంబు, అఖిలోన్నతులున్"

స మా ప్త ము

శ్రీకృష్ణార్పణము

ఓమ్ తత్ సత్



# స్ఖాలిత్యములు – సవరణలు

| పుట | పంక్తి | స్ఖాలిత్యము | సవరణ |
|---|---|---|---|
| 19 | 4 | గంతక | గందక |
| ,, | 19 | ఆభవ | అభవ |
| 22 | 5 | నేల | లేల |
| 23 | 2 | ఆవికల | అవికల |
| 27 | 16 | ప్రజ్ఞాతా | ప్రజ్ఞతా |
| 35 | 6 | పారుమలకు | పామరులకు |
| 36 | 16 | పెన్రటికి | పెన్నటికి |
| 40 | 20 | నపయించు | నపనయించు |
| ,, | 22 | ఆకర్మ | అకర్మ |
| 44 | 20 | కెఋన్ | కెఋగున్ |
| 68 | 4 | పరమైన | పరమమైన |
| 72 | 13,15 | దైత | ద్వైత |
| 84 | 8 | ధనజయా | ధనంజయా |
| 95 | 14 | నుదాసీ | నుదాసీను |
| 111 | 21 | నుమ్మలిక | నుమ్మలిక |

93 వపుటలో మొదటి 4 పంక్తులు తరువాతి 4 పంక్తులుకలసి ఒకపద్యము